


యవ్వనంతో మిసమిసలాడిపోతున్న అద్భుత సౌందర్యరాశి ఆమె. తీర్చిదిద్దినట్లుండే అవయవ సౌష్టవం ఆమెది. అలాంటి యువతిని ఆమె బాస్ ఆజ్ఞాపించాడు... మరుక్షణం ఆమె నిస్సంకోచంగా తన దుస్తులన్నింటిని తీసి కుప్పగా ఓ మూల వదిలివేసింది... నిర్లజ్జగా, నిర్లిప్తంగా వారందరి ముందూ తన అపూర్వ సౌందర్యాన్ని నగ్నంగా ప్రదర్శిస్తూ నిలబడింది. కేవలం ఒక్క మాటతో, ఆజ్ఞాపనతో ఇదెలా సంభవమయింది? ఎవరా సుందరి...? ఎవరా ప్రేక్షకులు...?

కొందరి దృష్టిలో ఆ దేశం భూతల స్వర్గం. అక్కడ ఆకలి దప్పులు లేవు... కూడు గుడ్డలకు లోటు లేదు... రేపు గురించిన భయం లేదు... నేడు గురించిన దిగులు లేదు... అసలు సమస్యలనేవే లేవు...

కానీ, మరికొందరి దృష్టిలో అది నరకం... అక్కడివారు కేవలం మరల్లాంటి మనుషులు... వారి బ్రతుకులు వారివి కావు... వారి మనసులు వారివి కావు... వారి ఆలోచనలు వారివి కావు... అటువంటి స్వర్గ-నరకంలో చివరికి ఏం జరిగింది? నలుగురి ముందూ నిస్సంకోచంగా నగ్న నృత్యం చేసిన సుందరి చివరికి ఆ నలుగురినీ ఏం చేసింది...?

'చతుర' ఏప్రిల్ సంచికలో సమర్పిస్తున్న 'సుజాత' నవల 'స్వర్గ-నరకం' చదవండి. నవలతో పాటు అదనంగా అద్భుత 'చతుర ప్రపంచం', గిలిగింతలు పెట్టే చతుర 'మినీ కతలు' ప్రత్యేకాకర్షణ. నాలుగు రంగుల్లో ఆఫ్‌సెట్ ముద్రణలో వర్ణ చిత్రాలు 'చతుర' మాత్రమే అందజేసే అపూర్వాకర్షణ.

*నవనవలా వేదిక*

**చతుర**

*132 పేజీలు*

రెండు రూపాయలే

# సరస్వతీ మాసపత్రిక
# స్వాతి సచిత్ర మాసపత్రిక

## పాఠకేరటాలు:
సాహిత్యపు బంగారు గనిని శోధించి మేలిమి బంగారంలాంటి
కథల్ని సాధించి పాఠకులకు అందించే శీర్షిక.

## కథలు:
కంచికెళ్లకుండా
సూటిగా పాఠకుల గుండెల్లో గూడుకట్టుకుంటాయి.

## బొమ్మలు:
బొమ్మలకొలువు ఏడాదికి ఒక్కసారే. కాని
"స్వాతి" కథలకు నెల్నెలా అపరంజిబొమ్మల్తో
అలంకరించి ప్రతినెలా పండుగ చేస్తుంది.

## కార్టూన్లు:
మీకు ఆనందాన్ని తద్వారా ఆరోగ్యాన్ని ప్రసాదించేవి.

## స్వాతి ముత్యాలు:
నెల్నెలా అందించే అనుబంధ నవల పత్తుల్ని
పరవశింపజేసే నవరసాల వల.

## సీరియల్స్:
వచ్చేసంచిక ఎప్పుడొస్తుందా అని పాఠకులు ఎదురుచూసేలా
ఉత్సుకతను రేకెత్తించి గలగలా పారే సెలయేరులు.

## నాకునచ్చిన కథ:
ఒక ఉత్తమ రచయిత మరో రచయితయొక్క
ఉత్తమోత్తమ కథా పరిచయ మాలిక.

## వినదగు నెవ్వరుచెప్పిన:
పత్రికను తీర్చి దిద్దే మా ప్రయత్నంలో ప్రతి
పాఠకుణ్ణీ భాగస్వామినిచేసే స్వేచ్ఛా వాణి.

## కదిలే బొమ్మల కబుర్లు:
పాఠకులు కథలు కథలుగా చెప్పుకునే సినిమా కబుర్ల శీర్షిక.

## ఈనెల ప్రశ్న:
పత్రికలో ఇది చివరిపేజీ శీర్షిక. కానీ నెల్నెలా
ఒక పాఠకుడికి పట్టంకట్టే మొదటి వేదిక.

## గెటప్:
DRESS AND ADDRESS అన్నట్లుగా
పత్రికల్లో "వేష, భాషలందు స్వాతి లె




# స్వాతి

P.B.NO.339, విజయవాడ-520002.

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
*దేశోద్ధారక కాశీనాధుని*
*నాగేశ్వరరావు పంతులుగారు*
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 1972]
శుక్రవారం : 10 4 '81
దుర్మతినామ సం. చైత్ర శు. షష్ఠి
***సంపుటము 74 సంచిక 30***
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు 54-60
ఆరు మాసాల చందా రు. 27-30
విడి ప్రతి వెల ఒక రూపాయి
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం. విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

లోకంపోకడ







## ఉగాది శుభాకాంక్షలు

మా పాఠకులకు, రచయితలకు, ఏజెంట్‌లకు, ప్రకటన కర్తలకు, అందరికీ మా ఉగాది శుభాకాంక్షలు!

—సం.

## ఉత్తరాలు

### సీరియల్స్

అంజలీనాయుడు ముఖచిత్రంతో వెలువడిన సంచికలో కొత్త సీరియల్ రాగబంధితులు మొదట్లోనే నన్ను ఆకట్టుకుంది.

జె. గణపతిరావు, జె. రవిచంద్ర [నిడుబ్రోలు]

* * *

స్పందన ముగింపు చాలా బావుంది. అభ్యుదయ పథంలో మొదలైన సీరియల్ చివరి వరకూ అలానే కొనసాగింది. రామం క్రిస్టియన్ యువతిని పెండ్లాడటం, చంపా, అప్పారావుల మోహం వంటి సంఘటనలు సీరియల్‌లో నిమ చ్చుతునకలు మాత్రమే. రచయిత ముగింపులో పలాయన వాదం పాటించ కుండా ధైర్యంగా వ్యవహరించారు. రచనాశైలిలోనూ, పాత్రల చిత్రీకరణలోనూ, సంఘటనలు మూడి వేయడంలోనూ రచయిత చూపిన నైపుణ్యం ప్రశంసనీయం.

మటికాన ప్రకాష్ (విజయనగరం)

### కథలు

ఈ వారం ప్రచురించిన కథలన్నింటిలో "పుష్కర కన్య" కథ చాల బాగుంది. ఈ కథలో డిగ్రీ చదివిన రాణికి ఎక్కడా ఉద్యోగం దొరక్క తన అందంతో యువకులను ఆకట్టుకుని మోసం చేస్తూ ఉంటుంది. నిజానికి మన సమాజంలో ఇలాంటి ఆడవాళ్ళు కూడ ఉండకపోరు! అని అనిపిస్తుంది నాకు.

చంద్రశేఖర్ దేశాయ్ [ఆదోని]

* * *

13.3.81 నాటి ఆంధ్రపత్రిక అంజలీ నాయుడు ముఖచిత్రంతో నిండు పున్నమి వెన్నెలలా ఉంది. ఈ సంచికలో ప్రచురించిన "పుష్కర కన్య" కథ నన్ను విశేషంగా ఆకర్షించింది. మగవారు తియ్యని మాటలు చెప్పి రాణిని లొంగదీసుకుని తమ కోరికలు తీరేదాక వాడుకుని తరిమివేశారు. ఈ విధంగా అన్యాయం జరిగిన స్త్రీలో కోపోద్రేకాలు ఉండటం వేరే చెప్పనవసరం లేదు. తన జీవితాన్ని కుక్కలు చింపిన విస్తరిలా చేసిన మగ వారిపై కసి తీర్చుకోవడం— రాణి తీసుకున్న నిర్ణయం సబబుగా వుంది.

కందిగట్ల ప్రభాకర్ [జనగామ]

# దుర్మతిలో మీ భవిష్యత్తు....!

**మేషం :** ఈ రాశికి 'దుర్మతి' నామ సంవత్సరం అందంగా, ఆనందంగా, సుందరంగా గడిచిపోనున్నది. షష్ఠ శని, సుపర్ణమార్గం. చాలా కాలం గురుగ్రహం ఆయనతోనే ఉంటాడు. అందువలన సర్వవిధాలా విజయం ఆశించవచ్చు. అంటే, వత్సరమంతయూ గురువు, శనులు యోగ ప్రదాయకులు. ఏప్రిల్, మే నెలలు మాత్రం సర్వసాధారణ ఫలితములివ్వగలవు. పిమ్మట మూడు మాసాలు, ధనాదాయం, వ్యాపారలాభం, చిత్రకళా నైపుణ్యం, రాజకీయంగా అనుకూలత, లాభాపేక్షతో పనులు సాగించుట జరుగును. సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో యింటశుభకార్యం చాలమందికి సంభవం. గృహనిర్మాణం, 'కంట్రాక్టు' పనులందు విజయం కలుగును. నవంబరు, డిశంబరు నెలలందు వైద్యవృత్తి, ఉన్నతవిద్యా ప్రయత్నాలు, కొంత వరకు విదేశయానం చెప్పదగిన అంశం. జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలు సమస్త కార్యాచరణమునకు అనుకూలప్రదములు. విద్యార్థులకు 'మే' జూన్ నెలలందు అనుకూలత సంభవం, గ్రహించండి. స్త్రీలకు : ఉద్యోగవృత్తులందు ప్రగతి, ఆనందం, ఆశయసిద్ధి చెప్పదగిన అంశాలు.

**వృషభం:** ఈ రాశికి శనివత్సరాంతమువరకు తామ్రమూర్తి. కార్యవిలంబనం, మధ్య మధ్య కార్యవిఘ్నం, మొదటి మూడు నెలలందు కార్యములు సాఫీగా సాగిరావు. జూలై, ఆగస్టు నెలలందు సర్వకార్యములందు విజయసూచనలు గలవు. క్రీడారంగంలో, రాజకీయ, సాంఘిక రంగములలో అనుకూలత చెప్పదగిన అంశం. ఆరోగ్యలోపం కూడా సెప్టెంబరు, అక్టోబరు నెలలందు చెప్పదగిన అంశం. అవకాశాలు చిక్కినట్లు చిక్కి, ఇట్టే జారిపోతాయి. మాటకు విలువతగ్గే సూచనగలదు. డిశంబరు 14 నుండి, మార్చి నెలాఖరు వరకు, ఒక్క శుభ కార్య విషయంతప్ప, తక్కిన రంగాలలో అనవసరపు పేచీలు, యిబ్బందులు, మాటపట్టింపులు, కీచులాటలు, కోర్టు వ్యవహారాలలో అనాను కూలత సంభవమని గ్రహించి మెలగండి. స్త్రీలకు పూర్వార్థానికన్నా, ఉత్తరార్థంలో ఉద్యోగవృత్తులందు సర్వానుకూలత గలదని గ్రహించాలి.

**మిథునం:—** మీకు యింకా 'అర్ధాష్టమ' శనిబాధ తప్పలేదు. శరీరరుగ్మత, ఔషధ సేవ తప్పించి వపుషద్యైః, దానైః, జపైః అన్న అంశం తూ.చ తప్పక అనుసరింపవలసియుండును. మొదటి రెండు నెలలు కోపతాపాలకు గురికావటం, చిక్కిన సదవకాశాలు, చల్లగా జారిపోవటం, పిమ్మట మూడు నెలలో, చెప్పరాని యిబ్బందుల నెదుర్కొనవలసి రావటం, ఆగస్టు 21 తా, ప్రాంతము నుండి కొంత కొంత మేలుగా, ధనాదాయంతో, కళా సాహిత్యరంగానుకూలతతో కాలంగడిచి పోగలదు. కొందరకు, అంటే, వైద్య, న్యాయవాద, ఉపాధ్యాయ వృత్తులలోని వారికి అనుకూలత వత్సరాంతమువరకు చెప్పదగిన అంశం. నూతన వ్యవహారాలు తెలిసికోవటం, వ్యాపారమందు అనుకూలత, జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలల్లో అంటే 82 సం.లో చెప్పదగిన అంశాలు. సజ్జన సాంగత్యం, ఆదాయం కూడా సంభవమని గ్రహించండి స్త్రీలకు : ఉద్యోగ ప్రయత్నాలు అనుకూలం. వత్సరమంతయూ, ఆదాయంలో అభివృద్ధి గలదని గ్రహించాలి.

**కర్కాటకం :—** సంవత్సరమంతయూ సుఖ శాంతులుండగలవు. మొదటి రెండు నెలలు ధనాదాయం, క్రమపద్ధతిలో కార్యానుకూలత, క్రీడారంగంలో అనుకూలత చేకూరగలదు. జూన్ నెల నుండి జూలై 11 వరకూ, ఆగస్టు, సెప్టెంబరు నెలలు వ్యవహారానుకూలతకు, కోర్టు వ్యవహారాలు అంటే అనానుకూలత చేకూర్చే సంభవం. తదాది సెప్టెంబరు 4వ తా, వరకు ఏ విషయంలో అభివృద్ధి చెప్పుటకు వీలులేదు ఆ తరువాత 1982 జనవరి 14వ తా. నుండి మార్చి వరకు, సుఖ శాంతులుండగలవు. ఉ[illegible] గ్రహానుకూలత వలన, కళా సాహిత్య రంగాలలో అభివృద్ధి చెప్పదగియున్నది. అప్రయత్న ధనలబ్ధి, అనుకోకుండా పనులు నెరవేరుట చెప్పదగిన అంశం. మొత్తం మీద సంవత్సరంలో అర్ధభాగమే శుభదాయకం. స్త్రీలకు : కళారంగ ఖ్యాతి, ఉద్యోగంలో అభివృద్ధి, ఆనందోత్సాహాలు చెప్పదగిన అంశాలు.

**సింహం :—** ఈ రాశిలో 'పుబ్బ' నక్షత్రజాతకులు విశేష ఫలములను పొందనున్నారు. తక్కిన నక్షత్ర జాతకులకు సామాన్యఫలములే. మొదటి రెండు మాసాలలో ఆదాయం అంతగా చెప్పగల మార్గం లేదు. ఏడున్నర శనిబాధ యింకాతప్పుట లేదు. వత్సరమంతయు రెంట శని గ్రహస్థితి తామ్రమూర్తిగా నుండుటచేత వ్యాపార, వ్యవహారాలందు అంత సుగమమని చెప్పవీలు లేదు. 'జూన్, జూలై' నెలలందు, ధనలబ్ధి, కార్యానుకూలత, చెప్పదగిన అంశాలు. ఆగస్టు 17 తా, నుండి, అక్టోబరు 16 వరకు అప్రయత్న ధన లబ్ధి చెప్పదగిన అంశం. నవంబరు, డిశంబరు నెలలలందు, వ్యవహారపు చిక్కులు తీరే మార్గమున్నది. 1982 జనవరి నుండి వత్సరాంతం వరకు, శుభాశుభములు సమముగా నడచుటయే గాక, క్రీడారంగంలో, కళారంగానుభవం గల వారికి, సర్వానుకూలత సంభవం. స్త్రీలకు : వత్సరమంతయు శుభాశుభ సమములు, వత్సర చివరి భాగంలో ధనాదాయం చెప్ప వీలున్నదని గ్రహించాలి.

**కన్య :—** లగ్నశని వత్సరమంతయు తామ్ర మూర్తి గాన, ఈ రాశివారు శరీర విషయంగా జాగరూకత వహించాలి. వయసు మీరినవారు, మరీ జాగ్రత్త పడాలి. సంవత్సర మంతయు ఔషధసేవ తప్పదనిపించు చున్నది. వత్సరాది మొదలు, ఆగస్టు 21 తా. వరకు ఏ రంగంలో కూడా ప్రగతి కనిపించదనిగాని, ఆశించిన 'ప్రమోషన్' లభ్యమగుననిగాని, అప్రయత్నంగా పనులు నెరవేరుననిగాని, చెప్ప వీలు లేదు. సెప్టెంబరు, అక్టోబరు నెలలందు, గృహంలో కళ్యాణోత్సవం జరుగుటకు, నూతన ప్రయత్నాలు సఫలవంతం అగుటకు సుగమమైన కాలమే.

(52 వ పేజీ చూడండి)

## ఉగాది వేదిక

విశ్వంభర సర్వశాంతి
వికాసాన్ని సాధించింది
ఈ వినూత్నమే ఉగాది
భావి ప్రగతి వందుకొంది.
దుర్మతి సంవత్సరాది
మర్మాలను మాయపరచి
జయ విజయం జఝుస్తుంది
ప్రతి హృదయం పల్లవించి
సల్లాపం చిందుతుంది
ఆమనిలో—కామనలో
ఆత్మానందం విరుస్తుంది
వేపపూత—మల్లెమొగ్గ
కోకిలమ్మ మధురగీతి
పంచాంగం ఫలాఫలం
సర్వజగతి పూర్తి శుభం.

— రంగకవి

# ఇంద్రసింహాసనం

సి. ఆనందారాము

కొత్త సీరియల్ ప్రారంభం

**వృషపర్వ పురానికి కొంత దూరంలో ఉంది ఆ ఉద్యానవనం — నగరానికీ, ఆ ఉద్యానవనానికీ మధ్య అడవిదారి. నగర బాహిర ప్రాంతంలో ఉన్న ఆ ఉద్యానవనం రాక్షస రాజ్యానికి చెందినది కాదు — ఇటు రాక్షస రాజ్యంలోని వారు, అటు మానవులూ ఆ ఉద్యానవన సరోవరంలో జలక్రీడలాడటానికి వస్తూ ఉంటారు —**

ఆ నాడు రాత్రి సమయాన, ఎలాగైనా యయాతిని ఆ ఉద్యానవనంలో కలుసుకోవాలి శర్మిష్ఠ. శర్మిష్ఠ రాకుమారి — సాధారణ కన్యల లాగా ఆమె ఎక్కడికంటే అక్కడకు ఒంటరిగా బయలుదేరే అవకాశంలేదు— అహర్నిశలూ, వెంట చెలికత్తెలూ, అంగరక్షకులూ ఉండి తీరవలసిందే!

కానీ, శర్మిష్ఠ రాచకులంలో తప్పి పుట్టిందా, అనిపిస్తుంది — రాజకుమారిగా పుట్టినా, ఆమెకు రాకుమార్తెలకు సహజమైన అహంకారం, దర్పం, మొదలైనవి లేకపోగా, ఆర్ద్రమైన హృదయం ఉంది. అలాగని భీరువు కాదు — సమయం వస్తే ఎంత సాహసమైనా చెయ్యగలదు- అప్పుడామె నిజమైన రాజకుమారి. అందుకే ప్రతిరాత్రి రహస్య సొరంగ మార్గం ద్వారా, ఒంటరిగా ఖడ్గమాత్ర సహాయురాలై యయాతిని కలుసుకోవటానికి వెళ్తుంది. అతడామెకోసం అక్కడ ఒంటరిగా నిరీక్షిస్తుంటాడు. ఇంచుమించు ప్రతి కోటలోనూ కోట నుండి బయటకు రహస్యమార్గం ఉండక తప్పదు — రాజుల బ్రతుకులే అంత! ఏ క్షణానికా క్షణం తప్పించుకు పారిపోవటానికి సర్వసన్నాహాలు చేసుకుంటూ సర్వాధికారాలూ చెలాయిస్తుంటారు.

తమ నగరంలో ఉద్యానవనాలెన్నో ఉన్నా, ఎప్పుడూ నగరబాహిర ప్రాంతంలో ఉన్న ఆ ఉద్యానవనానికే దారి తీస్తుంది శర్మిష్ఠ. తప్పనిసరిగా ఆమె వెంట పరివారం బయలుదేరుతుంది. అయితే చెలికత్తెలుతప్ప మిగిలిన పరివారం ఉద్యానవనంలో ప్రవేశించరు. ఎందుకంటే, అది ఎంత రాక్షస రాజ్యమైనా,



స్త్రీల ఉద్యానవనంలోకి పురుషులు ప్రవేశించరు.

ఒకరోజు చెలికత్తెలతో ఉద్యానవనంలో విహరిస్తూ ఉండగా శర్మిష్ఠకు ఉద్యానవనానికి అవతలివైపున ఏముందో తెలుసుకోవాలని బుద్ధిపుట్టింది. "అటు ఏముంటుంది? అది మానవరాజ్యం. ఇంత వైభవం ఉండదు. అతి మామూలుగా ఉంటుంది" అంది చెలికత్తె. శర్మిష్ఠలో ఒక బలహీనత ఉంది. మనసులో ఒక సంకల్పం కలిగాలేకాని కష్టనిష్ఠూరాలు ఆలోచించక కార్యరూపంలో పెట్టేస్తుంది. ఈ తొందరపాటు కారణంగా ఆమె అనేకసార్లు చిక్కులలో పడింది. అయినా ఆ లక్షణం ఆమెను వదలదు. చెలికత్తెలందరూ వారించటం వల్ల వారికన్ను కప్పి, ఒంటరిగానే, ఉద్యానవనానికి ఆవలివైపు చేరుకొంది. అదంతా కారడవి. ఒక్క కాలిబాట అయినా లేదు. అయినా అత్యంత సాహసంతో ముందడుగు వేసింది. బల్లెంలాంటి పెద్దములు పాదరక్షలను చీల్చుకుని, పాదంలో కస్సున దిగింది — అప్రయత్నంగా "అబ్బా!" అని అరిచింది, సుకుమారి కావటంవల్ల — వెంటనే రెండు బలిష్ఠమైన అందమైన చేతులు ఆమెను పొదివి పట్టుకొన్నాయి—తల ఎత్తి చూసింది — ఎవరో సుందరమూర్తి — తేజోవంతాలయిన కళ్లు, ఆకర్షణీయమయిన చిరునవ్వు, వీరత్వం ఉట్టిపడే రమణీయ శరీరాకృతి. అతడు రెండు చేతులతో ఆమెను పూలచెండులా పైకెత్తి పట్టుకున్నాడు. బాధతోనో, పారవశ్యంతోనో, ఆమె కళ్లు మూసుకుంది. కళ్లు తెరిచేసరికి, ఒక చెట్టు నీడలో అతడి వళ్లో పడుకుని ఉంది. సిగ్గుతో చివాలున లేవబోయింది. లేవవద్దన్నట్లు ఆమెను చేతితో పట్టుకొని, తన సంచిలోని కొన్ని ఉపకరణాలతో కాలిముల్లు మెలకువగా ఊడలాగి అవతల పారేసాడు — రక్తం పొంగి ప్రవహించింది. తన పెదవులతో ఆ ప్రవాహాన్ని ఆపాడు. అరికాలులో చక్కిలిగింతలు— మనసులో సరిగమలు. కొన్ని నిమిషాల తర్వాత ఆమెను లేవదీసి చెట్టుకానించి కూర్చోపెట్టి, తానులేచి ఏ సరోవరంనుంచో నీటిని తెచ్చి, గాయంకడిగి, పైకండువా చింపి ఆ గాయానికి కట్టు కట్టాడు. అప్పుడు దూరంగా తొలిగి, సగౌరవంగా "రాకుమారీ! మీరెవరు? ఈ కీకారణ్యంలోకి ఎందుకు ప్రవేశించారు? ఇలాంటి చోట్ల నడవటానికి నాజూకుగా తయారు చేయబడ్డ మీ పాదరక్షలు చాలవు. ప్రత్యేకంగా తయారుచేయబడ్డ పాదరక్షలు ధరించాలి!" అంటూ మోకరిల్లిపరకూ



## ఇంద్రసింహాసనం

ఉన్న మందమైన తన లోహపు పాదరక్షలు చూపించాడు.

శర్మిష్ఠకు ఇంకా అతని హస్తస్పర్శ తన శరీరం, అనుభవిస్తున్నట్లుగానే ఉంది. ఏదో మైకపు పొర తన నావరించి ఉన్నట్లుగా సమాధానం చెప్పలేకపోయింది. ఆమె అతిలోక సౌందర్యాన్ని ప్రశంసా పూర్వకంగా చూస్తూ "రాకుమారీ! మీరెక్కడికి బయలుదేరారు? చెప్పండి. వీలైనంత సహకరిస్తాను." అన్నాడు శర్మిష్ఠ తన మైకంలోంచి తెప్పరిల్లింది. సిగ్గుపడుతూ లేచి నిలబడి "నేను వృషపర్వుడి కూతురుని" అంది. వెంటనే యయాతి ఒక్క అడుగు వెనక్కు వేసి "ఓ" అన్నాడు. శర్మిష్ఠ దెబ్బతిన్నట్లు చూసి "నేను రాకుమారిని" అంది రోషంగా. యయాతి నవ్వుతూ "అవును రాక్షస రాకుమారివి." అన్నాడు శర్మిష్ఠ చిన్నబుచ్చుకుంటూ "మీ దృష్టిలో రాక్షసులంత తక్కువ వారా? వాళ్ళెంత భయంకరులో తెలిస్తే... ..." అంది.

"అవును భయంకరులని తెలుసు— కానీ గౌరవించదగిన వారుకారు, నన్ను క్షమించండి. నేను ప్రత్యేకించి ఒక వర్గం గురించి మాట్లాడటం లేదు. కేవలం శరీరబలమే ప్రధానంగా జీవించేవారిపై నాకు గౌరవం లేదు."

ఈ మాటలకు ఏమనిసమాధానం చెప్పాలో శర్మిష్ఠకు తోచలేదు— వెల వెల పోయి చూసింది — ఆ చూపులకు జాలి కలిగింది యయాతిలో—

"రాకుమారీ! మీరు ఎక్కడకు వెళ్ళాలో చెప్పండి - అక్కడ మిమ్మల్ని దిగవిడుస్తాను. మీరు నడువలేరు—నడువదగిన ప్రదేశంకాదు" అన్నాడు.

ఇంతకుముందు బాధతో వొళ్ళు తెలివి దశలో యయాతి చేతులలో ఒదిగిపోయింది శర్మిష్ఠ కానీ, ఇప్పుడు తనంత తాను అతని చేతులలోకి వెళ్ళలేకపోయింది.

"మీ దగ్గర ఏదైనా గుర్రముంటే ఇవ్వండి. నేను వెళ్ళిపోతాను. మళ్ళీ త్వరలో మీ గుర్రం మీకు అప్పగిస్తాను." అంది.

ఆ చెట్టునీడలో కొంతదూరాన విశ్రాంతి తీసుకొంటున్న తన జాత్యశ్వం మూపు నిమిరాడు యయాతి. దాని చెవిలో "ఈ కుమారిని జాగ్రత్తగా ఆమె భవనందగ్గర దింపిరా!" అన్నాడు. మేలుజాతికి చెందిన ఆ గుర్రం కళ్ళలో స్పష్టంగా అనకనం కనిపించింది. ఇష్టం లేనట్లు తల అడ్డంగా ఊపింది. యయాతి బుజ్జగిస్తున్నాడు—"నా మాట వినాలి! రాకుమారిని ఆమెభవనంలో చేర్చు." అని కళ్ళెం శర్మిష్ఠ చేతులలో పెట్టాడు. చెంగున ఎగిరి గుర్రంపైనకూర్చుంది శర్మిష్ఠ. ఆ శరీరలాఘవాన్ని ప్రశంసాపూర్వకంగా చూసి "రాకుమారీ! ఒక్కమాట! ఈ గుర్రం ఎవరికి పడితే వారకి లొంగదు. మీరుతప్ప మరెవరూ దీనిపైకి ఎక్కకూడదు అది వారికే ప్రమాదం" అని దాని వీపుపై నిమిరాడు అశ్వరాజం ముందుకు లంఘించింది. వేగంగా ముందుకురుకుతున్న అశ్వంమీదనుంచి వెనక్కుతిరిగి రెండు చేతులూ జోడించింది శర్మిష్ఠ. యయాతి గుండె గతి తప్పింది — లిప్తమాత్రంలోనే చిరునవ్వుతో వెనుతిరిగి కళ్ళెం చేతిలోకి తీసుకొంది.




ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

# 2

# ఇంద్రసింహాసనం

ఆ అశ్వం ప్రాణంలో ప్రాణమయిపోయింది శర్మిష్ఠకి. ఎవరినీ ఆహారం కూడా వెయ్యనివ్వదు— తనే తినిపిస్తుంది. స్వయంగా శరీరం కడిగి అలంకరిస్తుంది. ఇంచుమించు ప్రతి సాయంత్రమూ, ఆ గుర్రంమీద నగర బహిర్ప్రాంతంలో ఉన్న ఆ ఉద్యానవనానికి వస్తుంది. ఎవరిని కలుసుకోవాలని ఆమె అంతరంగం తహతహ లాడుతోందో, ఎవరిని చూడగలననేఆశతో ప్రత్యేకించి, ఆ ప్రాంతానికి వచ్చిందో, ఆ వ్యక్తి అక్కడ కనపడడు — నిరాశతో తన భవనానికి వస్తుంది—ఇలా ఎన్ని దినాలు గడిచిపోయాయో ! అయినా ఆమె నిరాశ చెందలేదు. ఆ రోజు అలాగే గుర్రం మీద బయలుదేరింది. ఉన్నట్టుండి గుర్రం చెవులు రిక్కించింది, తల పైకెత్తి గట్టిగా సకిలించింది.అంతే! ముందుకురికి వేగంగాపరు గెత్తనారంభించింది. అది పోతున్నది తప్పుడు దారి అని తెలిసినా, దానిని అదుపులో పెట్టలేక పోయింది. గుర్రం మీద నుంచి క్రిందకు పడి పోకుండా తనను తాను కాపాడుకోవటమేకష్ట మయిపోతోంది. అంతటి వాయువేగ మనో వేగాలలో పరుగులు తీస్తోంది అశ్వం పరుగు ఆగింది. దిగ్భ్రమనుంచి తేరుకొని చూసింది శర్మిష్ఠ.ఎదురుగా విల్లమ్ములు ధరించిన వీర గంభీర సుందరమూర్తి యయాతి.సంభ్రమా వందాశ్చర్యాలతో గుర్రంమీద నుంచి క్రిందకు దూకింది. అశ్వరాజం యజమానినిచేరుకొంది అతడు దానిని ఆప్యాయంగా ఆలింగనం చేసు కొన్నాడు. తిర్యక్కయినా, దానికళ్ళ నుండి ఆనందాశ్రువులు జాలువారిపోతున్నాయి. వాటిని స్వయంగా తన చేత్తో తుడిచాడు అతడు. ఆ దృశ్యాన్ని ముగ్ధురాలయి చూస్తూ నిలిచి పోయిందామె. ఎంతటి ఆర్ద్ర హృదయం ! ఎంతటి ఆశ్రిత పక్షపాతం ! తన అశ్వాన్ని సమాశ్వాసించిన తరువాతనే శర్మిష్ఠను పలకరించాడు అతడు.

"రాకుమారీ ! క్షేమమా"

"తిరిగి తమ దర్శనంకాలేదు—ప్రతిరోజూ ఆ ప్రాంతానికి వస్తూనే ఉన్నాను."

"నన్ను చూడటానికా? ఎందుకు ?" అనుకోకుండా యయాతినిచూసిన ఆనందంలో మనసు తడబడింది, నోరు జారింది, ఆమె సిగ్గుపడింది. సర్దుకోబోయింది.

"మీ అశ్వం నా దగ్గరే ఉండిపోయింది— దానిని మీకప్పగించాలి కదా ?"

"దానికింత శ్రమ అక్కర్లేదు — దానిని బంధించి ఉంచకుండా స్వేచ్ఛగా వదిలేస్తే నేను ఎక్కడఉన్నా నా దగ్గరకి వచ్చేది."

"ఆ సంగతి నాకు తెలీదు"

"అవును. నేను చెప్పలేదు. ఒకసారి మీకు అర్పించిన దానిని తిరిగి తీసుకోవటం మర్యాద కాదనుకొన్నాను కానీ, ఇది నన్నువిడిచి ఉండ లేకపోతోంది."

"నేను సహితం మీకు అర్పించిన దానిని తిరిగి తీసుకోలేకపోతున్నాను" అనుకుంది శర్మిష్ఠ.

"కూర్చోండి" అని రత్నకంబళి పరిచాడు యయాతి. వెనుకటిలా అది అరణ్యప్రదేశం కాదు. ఏదో ఉద్యానవన ప్రాంతం. యయాతి విహారయాత్రకు వచ్చినట్టున్నాడు—అయిదారు గుడారాలు ఉన్నాయి. ఆ గుడారాల అలంకరణలో, పనితనంలో విభేదం స్పష్టంగా కనిపిస్తూ ఏ గుడారం ఏ వర్గానికి చెందినదో సులభంగా ఊహించటానికి వీలవుతుంది. చప్పట్లు చరిచాడు యయాతి. అతి సామాన్యాలు గుడ్డతో చేసిన గుడారంలోనుంచి ఇద్దరు సేవకులు పరుగునవచ్చి నిలిచారు. వారు పడుకున్నవారు లేచివచ్చినట్టు ముఖాలు చూస్తే తెలిసిపోతుంది. ఎంతటి గాఢనిద్రలో ఉన్నా ఆ సేవకులకు, రాజకుమారుడి చేతి చప్పుడు వినగానే మెలకువ వస్తుంది కాబోలు!

చేతులు కట్టుకొని తలలు వంచుకుని నిలబడ్డారు సేవకులు. ఎందుకు పిలిచారనైనా అడగలేదు.

"రాకుమారికి త్వరగా మధుర పానీయాలూ, ఫలహారాలూ సిద్ధంచెయ్యండి."

ఆ సేవకుల ముఖాలలో లిప్తమాత్రం నివ్వెరపాటు తొంగి చూసి అంతలో మాయ మయిపోయింది."చిత్తం"అని వెళ్ళిపోయారు.

రత్నకంబళిమీద కూచుని చుట్టూ చూసింది శర్మిష్ఠ. చంద్రుడాకాశమధ్యాన ఉన్నాడు ఆ వెండి వెన్నెల జల్లులో పూలు సహితం ముడుచుకుపోయి నిద్రిస్తున్నాయి. సేవకుల ముఖాలలో నివ్వెరపాటుకు కారణం అప్పుడర్థమయింది. రాత్రి చాలా గడిచింది. అశ్వం అతి వేగంతో ఉరకలు వేస్తోంటే, ఎంత దూరం సాగిపోయిందో, తెలియలేదు. బహుశః తమ నగరం నుంచి అనేక యోజనాలు వచ్చి ఉండవచ్చు. లేకపోతే, ఇంత రాత్రి కాదు. ఈ రాత్రివేళ సేవకులు ఫలహార పానీయాలు ఎలా సమకూర్చగలరు? అదీ ఉద్యానవన ప్రాంతంలో— అదంతా వారి బాధ్యత, రాజాజ్ఞ నెరవేర్చి తీరవలసిందే! శర్మిష్ఠ సహించలేక పోయింది.

"ఇప్పుడు నాకేమీ వద్దు. వారినేమీ సమకూర్చవద్దని ఆజ్ఞాపించండి. ఈ సమయం కాని సమయంలో ఆ సేవకులు శ్రమ పడవలసిన అత్యవసర మేముందీ ?" యయాతి ఆశ్చర్యంగా చూసాడు, శర్మిష్ఠను. అతని కళ్లలో ఆదరపూర్వకమైన ప్రశంస ఉంది.

"నా సేవకులకు శ్రమ పడవలసిన అవసరం ఏనాటికీ రాదు— నా గుడారంలో



## ఇంద్ర సింహాసనం

పానీయాలూ, ఫలహారాలూ ఎప్పుడూ సిద్ధం గానే ఉంటాయి.''

''అన్ని వేళలలోనూనా ?''

''ఆ ! నా కోసం కాదు— ఏ దేవదూతలో యుద్ధంలో సహాయం కోరుతూ రావచ్చుకదా! వాళ్ళు ఏ వేళలోనైనా వస్తారు. దేవతలకూ, దానవులకూ యుద్ధం జరగని సమయమంటూ లేదు కదా! ఏ క్షణంలో ఏం ముంచుకు వస్తుందో, ఎవరు చెప్పగలరు ? ఆ దేవ దూతలకు అతిథి సత్కారాల కోసం, అన్ని వేళలా సర్వమూ సిద్ధంగానే ఉంటాయి.''

దేవతలూ, దానవులూ, యుద్ధాలూ, ఈ మాటలు వినేసరికి శర్మిష్ఠ మనసంతా వికలమయింది. అసలు ఈ యుద్ధాలెందుకో, ఒకరితో ఒకరు ఎందుకిలా తీవ్ర పోరాటాలు సలుపుకొంటారో, శర్మిష్ఠ ఊహకందనిది—

''అలా అయితే మీరు నాకు సత్కారం చేయక్కర్లేదు. నేను రాక్షస కన్యను'' అంది.

''కానీ, నాకు మిత్రురాలివి.''

''మీరు రాక్షసులతో కూడా చెలిమి చేస్తారా ?''

''జన్మను బట్టి వర్ణాన్ని నిర్ణయించ కూడదు. జన్మతః రాక్షస వర్గంలో జన్మించినా, దేవతలను తలదన్నే ఆత్మశక్తి సంపన్నులున్నారు నువ్వు జన్మించినది ఏ వంశంలో నయినా, రాక్షస కన్యగా నాకు తోచటం లేదు.''

శర్మిష్ఠ మనసులో వేయి విద్యుల్లతలు మెరిసాయి. అయినా అదే క్షణంలో స్వజాత్యా భిమానం మనసులో ఏ మూలనో తలెత్తి కొద్దిగా చివుక్కుమంది. అదంతా గమనించి నట్లు చిరునవ్వు చిందించాడు యయాతి. ''మనమంతా ఇంతే ! అనేక భావాలు ఒక్క సారిగా ఊపిరి పోసుకొంటాయి. ఏది తప్పో, ఏది ఒప్పో కూడా గుర్తించలేం !''

అతడు 'మనం' అని మాట్లాడినందుకు శర్మిష్ఠ ఆనందించింది.

మణిమాణిక్యాలు తాపిన బంగారు పాత్రలలో ఫలహారాలూ, పానీయాలూ వచ్చాయి. ఆ మణుల కాంతులు వెన్నెలనే మింగేస్తున్నాయి.

కొద్ది కొద్దిగా అన్నీ రుచి చూసింది.

''ఇంతేనా ? మా ఆహారం మీకు రుచించ లేదా ?''

# డెట్ బిళ్ల వాడండి, తెలుపును పొందండి

ఇపుడు ముందుకంటే
ఎంతో ఎక్కువ మంది
డెట్ బిళ్ల యొక్క
ఉజ్వలమైన ఉతుకును
ఇష్టపడుతున్నారు;
వారంటారు,
ఇది మిరమిట్ల తెలుపును.
ఎంతో ఎక్కువగా
పొదుపును ఇస్తుంది.




## డెట్ బిళ్ల

Shilpi-DM-41 A/80 Tel.

ఆ మాట విందుకో మనస్సును గుచ్చి నట్టనిపించింది.

"నేను మీకెలా కనిపిస్తున్నాను? కుండలతో ఆహారం మింగేదానిలా కనిపిస్తున్నాను కదూ? ఎలా అయినా మా జాతి అంటే మీకు చిన్నచూపు పోదు—కానీ, మహా తపశ్శక్తి సంపన్నుడు శుక్రాచార్యుడు మాకు గురువు. అది తెలుసు కదూ?"

"తెలుసు—కానీ..."

"కానీ...?"

"రాకుమారీ! ఈ "కానీ"కి సమాధానం లోనే సృష్టి రహస్యమంతా, అర్థధర్మ సూక్ష్మమంతా ఇమిడి ఉంది. ఆధ్యాత్మికశక్తి, ఆత్మశక్తి అంటే ఏమిటి? ప్రాణికోటి ఈ శక్తినెలా సాధించగలదు? ఆత్మశక్తి సంపన్నులకు బలహీనతలుండవా? బలహీనులైనవారి ఆత్మశక్తి నిరుపయోగమా? అసలు జీవకోటి అంతిమ ధ్యేయమేమని చెప్పుకోవాలి? ఇలా విన్ని ప్రశ్నలైనా ఉదయిస్తాయి—సమాధానాలు మాత్రం స్పష్టంగా తోచవు."

# ఇంద్రసింహాసనం

అతని మాటలు సరిగా అర్థం చేసుకోలేక బెంబేలుగా చూసింది శర్మిష్ఠ. అతడు చిరునవ్వుతో "లోకంలో అనేకమంది, ఆలోచనతో, అనుభవంతో, సాధనతో. ఏ స్థాయికి చేరుకోవాలని ప్రయత్నిస్తున్నారో, మీరు ఆ స్థాయిలో జన్మతః ఉన్నారు. ఇది అప్రయత్న లబ్ధమా, ప్రయత్న సాధ్యమా? అనేది నేను నిర్ణయించుకోలేక పోయినా, ఈ ఆలోచనలతో మీరు మనసు చికాకు పెట్టుకోనక్కర్లేదు" అన్నాడు. అతని ప్రశంసకు ఆనందంతో, చిరుసిగ్గుతో తల దించుకొంది. అయినా, ఆమె మనసులో సందేహ నివృత్తి కాలేదు.

"రాకుమారా! మాజాతి అంత మన్నించదగినది కాకపోతే, శుక్రాచార్యుడంతటివాడు మాకాచార్యత్వం నెరపటానికి ఎలా అంగీకరించాడు? అతని ఆచార్యత్వంలో మా జాతి మన్నన పొందలేదా?"

యయాతి చిరునవ్వుతో "మీ ప్రశ్నలకు నా సమాధానాలు మీ మనసుకు కష్టం కలిగిస్తాయేమో? మీ మనసు నొప్పించలేను" అన్నాడు

"ఫరవాలేదు చెప్పండి" ఆమె కళ్లలో కుతూహలం! తన ఊహాలోనించి, ఈ విచిత్ర విషయాలు తెలుసుకోవాలని జిజ్ఞాస—

"శుక్రాచార్యులు మీ జాతిని అభిమానించి మీకు ఆచార్యుడుగా రాలేదు— తన "అహం" నిలుపుకోవటానికి వచ్చాడు— శుక్రుడు, బృహస్పతి— ఇద్దరూ అంగీరసుడి దగ్గిర చదువుకొన్నారు. అంగీరసుడు బృహస్పతికి బోధించినట్లు శుక్రుడికి బోధించలేదు. బృహస్పతిని దేవగురువును చేయాలని అతడి సంకల్పం. శుక్రుడిది గ్రహించాడు— అంగీరసుడి శిష్యరికం వదిలి స్వయం సాధనతో పరమేశ్వరానుగ్రహంతో విద్యలు నేర్చాడు. ఆ తరువాత బృహస్పతికి పోటీగా తను రాక్షసులకు ఆచార్యుడై వారిని దేవతలకు తీసిపోనివారుగా మలచాలని ప్రయత్నిస్తున్నాడు. శుక్రాచార్యుల మృత


"ఓహ్, ఏమా అందం!"
మిమ్మల్ని చూసి అందరూ మెచ్చుకునేందుకు
మదురా బట్టలు.
పాలియెస్టర్ మిశ్రిత మదురా బట్టల విస్తృత శ్రేణిలోని
ప్రతి అంశం అందం చిందించేదే. ఆ రంగులు,
ఆ ప్రింట్లు, ఆ డిజైన్లు, ఆ నాణ్యత, ఆ ధర...ఓహ్!
మదురా బట్టలు
మదురా కోట్స్ ఉత్పాదన

# ఇంద్రసింహాసనం

సంజీవనీ విద్యామహత్యం వల్లనే, దేవతలు రాక్షసులను జయించలేకపోతున్నారు.''

ఆశ్చర్యంతో శర్మిష్ఠ కళ్ళు పెద్దవయ్యాయి.

''మహర్షులలో ఇన్ని సంకుచిత భావాలా? మహర్షికి లోక కల్యాణం కంటె తన ''అహం'' ప్రధాన మవుతుందా ?''

యయాతి చిన్న చిరునవ్వుతో ''చూసారా? అభం శుభం తెలియని మీ పసి మనస్సు సహితం సృష్టి మర్మాలను గురించి ఆలోచిస్తోంది. ఆత్మశక్తి, ఆత్మసాక్షాత్కారానికి వినియోగపడిన నాడు, విశ్వమంతా, సత్యమూ, శివమూ, సుందరమూ అయిపోతుంది. కానీ, అలా జరగదు. నియమ నిగ్రహాలతో సాధించిన ఆత్మశక్తి, నిగ్రహం లేని బలహీనతలకు ఆహుతయిపోతోంది — అంతతో సాధించిన ప్రగతి అంతంత మాత్ర మయిపోతోంది'' అన్నాడు.

తన పెద్ద కళ్ళను మరింత పెద్దవిచేసి కాంతులు విరజిమ్ముతూ చూసింది శర్మిష్ఠ. యయాతి ఆ అమాయకత్వానికి ముచ్చట పడుతూ ''నా మాటలు విని నేనేదో ఉన్నతుణ్ణని భ్రమపడకండి. యువరాజుగా నా శిక్షణలో శాస్త్ర పరిజ్ఞానం ఒక ప్రధానమైన భాగం. ఆ కారణాన నాకు అనేక విషయాలు తెలుసు-అంతే!'' అన్నాడు.

చూస్తూ ఉండగానే వెన్నెలలు మసకబార సాగాయి. ''రాకుమారీ! పదండి! మీ భవనం దగ్గిర దించి వస్తాను'' అని లేచాడు. అక్కడ మరి కొంతసేపు కూచోవాలనీ, అతడితో ఏవేవో మాట్లాడాలనీ కోరికగా ఉంది శర్మిష్ఠకి. విధిలేక లేచింది. ఆమెను ముందుగా అశ్వం మీదకు ఎక్కించి, తాను వెనుక కూచొని, అశ్వాన్ని అదలించాడు— యయాతి. ఆ అనుభూతి శర్మిష్ఠ కెంతో అపురూపంగా తోచింది. అశ్వం ఎప్పటిలా వాయువేగంతో ఉరకలువేస్తున్నా, వెనుకటిలా ఆమెకు భయం కలగలేదు! బలిష్ఠమైన అతని చేతుల మధ్య తాను సురక్షితంగా ఉన్నట్లు, నిశ్చింతతో కూడిన హాయి కలగ సాగింది. వృషపర్వపురాన్ని సమీపిస్తుండగానే రాక్షస సేనలు అశ్వాన్ని చుట్టుముట్టాయి. భయంతో వణకిపోయింది శర్మిష్ఠ. ఒకచేతో, ఆమెను సమాశ్వాసిస్తూ, మరోచేతో, ఖడ్గాన్ని ముందుకు ఉకిరిస్తూ, అత్యంత లాఘవంగా వారిని తప్పించుకొని, నగర ముఖ ద్వారం దగ్గిర అశ్వాన్ని నిలిపాడు, శర్మిష్ఠను దిగమన్నట్లు. శర్మిష్ఠ దిగకుండానే ''తిరిగి వాళ్ళు మిమ్మల్ని ముట్టడిస్తారేమో!'' అంది.

''నాకేం భయం లేదు- మీరు మీ భవనానికి చేరుకోండి.''

''మరి మీరెలా ఉన్నారో, నాకెలా తెలుస్తుంది ?''

ఆమె కళ్ళలోకి చూసి నవ్వాడు — ఆమె అంతరాంతరాల్లో ఆమెకే తెలియని రహస్యాలు చదువుతున్నట్లుగా ఉన్నాయి, ఆ చూపులు. సర్వలోకాలనూ ఎదిరించగల స్థైర్యం ఆ నవ్వులో.

''రేపు మీ నగర బహిర ప్రాంతంలో ఉన్న ఉద్యానవనానికి ఆవలివైపుకు రండి. నేనెలా ఉన్నానో చూద్దురుగాని.''

ఈ మాటలంటూనే అశ్వాన్ని ముందు కురికించాడు.

(ఇంకా వుంది)

ఎందుకైనా మంచిది - ఈ ఉగాది ప్రసాదం 'నా ఒంటికి పడుతుందో లేదో! కాస్త 'టెస్ట్ డోస్'గా ఇవ్వు-తింటా..!!



# ఆంధ్ర సచిత్ర వారపత్రిక 1980 ఫిలిమ్ బ్యాలట్ ఫలితాలు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక నిర్వహించిన పాఠకుల బ్యాలట్‌లో 1980 సంవత్సరానికిగాను ఈ క్రింది చిత్రాన్ని, యీ క్రింద పేర్కొన్న సాంకేతిక నటీనటుల వర్గాన్ని మా పాఠకులు ఎన్నుకున్నారు. బ్యాలట్ విజేతలలో మేము ఈ సమాచారం అందజేయగానే శ్రీయుతులు విశ్వనాథ్, అల్లు రామలింగయ్య శ్రీమతి సుజాత తమ శుభాకాంక్షలతో ఫొటోలను పంపారు. బ్యాలట్ విజేతలకు మా శుభాభినందనలు !



ఉత్తమ నటుడు : జె.వి. సోమయాజులు






ఉత్తమ నటి : సుజాత



ఉత్తమ హాస్య నటుడు : అల్లు రామలింగయ్య ★ ఉత్తమ దర్శకుడు : విశ్వనాథ్ ★ ఉత్తమ [illegible] : రమాప్రభ







ఉత్తమ సహాయనటుడు : చంద్రమోహన్ ★ ఉత్తమ సంగీత దర్శకుడు : మహాదేవన్ ★ ఉత్తమ సహాయ నటి : రాజ్యలక్ష్మి









# ఉగాది

## తెలుగుదనం విండుగా వెలుగొందిన తొలి పండుగ వుగాది.

నూతన సంవత్సరపు ఆశలను, ఆశయాలను ప్రోది చేసేది వుగాది. యుగాది అనే శబ్దానికిది వికృతి రూపం. చాంద్రమాన కాలాన్నిబట్టి చైత్ర శుద్ధ పాడ్యమి ఉగాది. చతుర్వర్గ చింతామణికర్త, ఆదిదేవుడైన బ్రహ్మ యీ రోజుననే సృష్ట్యారంభాన్ని గావించాడని చెప్పాడు. ఆ హేమాద్రి భావనను యిప్పటి హేతువాదు లంగీకరించక పోవచ్చును కాని, తరతరాల తెలుగు వారికీ వుగాది తొలిపండుగ దినంగా పరిగణింపబడుతోంది.

ఈ రోజున మనవారంతా ప్రాతఃకాలాన లేచి, అభ్యంగన, నూతన వస్త్రధారణ గావించి, గృహ, పరిసరాలను వేస, మామిడి తోరణాలతో అలంకరిస్తారు. గృహ ప్రాంగణంలో మండప నిర్మాణం చేసి, నూతన సంవత్సర పంచాంగాన్ని, సంవత్సరాది దేవతను పూజిస్తారు. పిదప సంవత్సరాది ప్రసాదాన్ని ఆరగిస్తారు. ఈ ప్రసాదం ఎన్నో పూర్వాపరాల అర్థాలకు కూడలి. ఈ ప్రసాదంలో ఆ ఋతువులో ఫలించిన బెల్లం, చింతపండు, మామిడి ముక్కలు, వేపపూత ఇత్యాది వస్తు సామగ్రి వుంటుంది. కొన్ని ప్రాంతాలలో చెఱుకుపాలతో కలిపిన ఆవునేతిని కూడ సేవిస్తారు. ఈ షడ్రుచుల సమ్మేళనం కొత్త సంవత్సరంలోని రాగద్వేషాది అరిషడ్వర్గాల విజయం, ప్రమోద, ప్రమాద, వైరాగ్య సమ్మిశ్రాకి భావనాతీత బలాన్ని మనిషికి ప్రసాదిస్తుంది. తామరాకుమీది నీటిబొట్టులా, జీవితాన్ని సాగించే ఆకర్మణ్యతను లౌకిక, పారలౌకిక జీవితసేతువుగా పండగ వుండటాన్ని సాంకేతికంగా సూచిస్తుంది.

ధర్మసింధుకర్త ఉగాదినాటి కార్యక్రమాలను దిగువ తెల్పిన రీతిగా తెలిపాడు.

"తైలాభ్యంగం, సంకల్పాదే, నూతన సంవత్సర<br>
నామ కీర్తనాద్యారంభమ్<br>
ప్రతి గృహధ్వజారోహణమ్, నింబపత్రాశనమ్,<br>
వత్సరాది ఫలశ్రవణమ్"

నూతన పంచాంగ శ్రవణంలో ప్రతి వ్యక్తి తమ భౌతిక జీవిత ఆదాయ వ్యయాలను, రాజపూజ్యావమాన విశేషాలను బేరీజు వేసుకొని, సుకర్తవ్యతాముద్రతో భావిజీవితానికి భవిష్య త్ప్రణాళికలు వేసుకుంటాడు. "ప్రత్యహమ్ నరః ఆత్మన ప్రత్యవేక్షేతః కిన్నుమే పశుభిస్తుల్యమ్ కిన్నుసత్పురుషోయివ" అన్న హితోపదేశకారుని సూక్తిని బట్టి ప్రతి మనిషికీ గత జీవన సింహావలోకనాలు, భవిష్యత్ప్రణాళికలు పురోగమనానికి ప్రాతిపదికలేగదా!

వ్యవసాయ ప్రధానమైన మన దేశంలో, కొన్ని ప్రాంతాల్లో రైతులు కృషికి తొలి మెట్టు అయిన ఏరువాక దినోత్సవాన్ని గూడ ఉగాదినాడు నిర్వహించటం పరిపాటి. ఆబాలగోపాలం వారి వారి మనఃప్రవృత్తులనుబట్టి క్రీడా, వినోద, విజ్ఞానాది విషయాలలో ఉగాదిని గడిపి సంవత్సరం పొడుగునా తమ వ్యాసంగాలు చక్కగా, చిక్కగా సాగిపోవాలని ఆశిస్తారు. ముఖ్యంగా, కళాత్మక విషయాలలో ఉగాదికి ప్రాముఖ్యం వున్నది. ఎన్నో సాహితీ, సాంస్కృతిక సంస్థలు సంవత్సరాది సోయగాలుగా ఈనాడు సమారంభం అవుతాయి. కవిసమ్మేళనాలు, కావ్యావిష్కరణలు, ఉగాది పర్వదిన వైభవాని కుల్లభం ఎత్తుతూ రసవన్మధురంగా జరుగుతాయి. ఆంధ్ర భోజుడైన శ్రీకృష్ణదేవరాయలు కూడ ఉగాది పండగి దినాల సందర్భంగా వసంత కాలపు సాంస్కృతికోత్సవాలు నిర్వహించేవాడని, విద్వజ్జన సమ్మానం గావించేవాడని రాయలవారి వసంతోత్సవలాస్యాన్ని తిమ్మనాది ప్రబంధ కవులెంతో అందంగా అభివర్ణించారు. ఈ సంవత్సరాది పండగ వసంతఋతువులో వస్తుంది. షడ్రుతువులలో వసంతం నవరాగ రంజితం. సర్వజనహ్లాదైకమయం. సృష్టిలోని ప్రకృతి అంతా ఫలపుష్పభరితమై, చైత్రలక్ష్మి తన నూపుర నిక్వాణంతో, ఉగాది వాణి వీణాగానంతో జగతి నాశీర్వదింప వస్తుంది. ఆ నవవసంత విన్యాసం నాటి కాళిదాసాదుల కమనీయ లేఖినుల నుండి నేటి కవివరేణ్యుల బాణీవరకు ఎన్నో మధుర కావ్యాల్లో సందర్శిస్తూనే వస్తున్నాం. ఉగాదినాటి వాతావరణం సమశీతోష్ణంగా వుండి, జీవరాసులకు సమగతిని, సామ్యభావనను సంకేతంగా అందిస్తుంది. అంతకు కొద్దిరోజుల ముందుగా పూర్తి అయిన కామదహన సంరంభాలు కూడ తెలుగువారికి నూతన సంవత్సరంలో అరిషడ్వర్గ నిర్మూలనను సూచిస్తూ, అభ్యుదయప్రణాళికలకు మీదుకట్టుకోవాలని భంగ్యంతరంగా సూచిస్తుంది.

తక్కిన పండగలన్నీ భారతీయ సంస్కృతికి ప్రతీకలయితే, తెలుగువారి అనూచాన సంప్రదాయ వాదాలకు ఉగాదివిజయపతాక. భారతీయాధ్యాత్మిక యాగ యోగానికి, యథాశక్తి సమిధ నొసగిన ఆంధ్రుల జీవనదర్పణం.

"సుచంద్ర"

## ఎండలో జాగ్రత్త!

★ మంచినీళ్లలో గులాబీపూలు, మల్లెపూలు ఏవో ఒకటి వేసి త్రాగండి–చలవచేస్తాయి!

★ కూజాలో మెంతులైనా, మరమరాలైనా వేయండి — ఆ నీళ్ళు త్రాగండి!

★ చిట్టుడుకునీళ్లు అంటారే అవి తీసుకుని చిటికెడు వుప్పు—వో నేతి బొట్టు వేసుకుని త్రాగితే ఎండాకాలంలో మంచిది. బియ్యంలో అవసరమైన కన్నా ఎక్కువ ఎసరు పెట్టి అన్నం వుడుకుపట్టేకా, ఆ "చిట్టుడుకు" నీళ్లను వార్చి త్రాగాలి.

★ తలపోటూ, కళ్ల మంటలు వస్తాయి ఎండలకి — అప్పుడు మంచిగంధం తీసి తల మీద పెట్టుకోవాలి.

★ వేసవి కాలంలో నెయ్యి, నూనె, అన్నంలో కలుపుకుతినే వాళ్లకి విపరీతంగా దాహం వేస్తుంది — అటువంటప్పుడు ఒక చింత గింజను బద్దలుకొట్టి ఒక బద్ద నోట్లో బుగ్గన పెట్టుకుంటే 'దప్పిక' తగ్గిపోతుంది.

★ నీరుల్లిపాయను పచ్చిగా తినటం గూడా మంచిది.

★ రాత్రిపూట రెండు ఎండు ఖర్జూర కాయలు అరకప్పు నీటిలో వేసివుంచి ఉదయమే లేచి ఆ నీళ్ల త్రాగండి.

– ఎం వి రుక్మిణమ్మ

[బిలస్‌పూర్]



అందమైన సాయంకాలం...
ఇది క్యాంపా సమయం అది ఎంతో మధురం
Campo
Campo
Campa Cola
Campa Cola
క్యాంపా
లెమన్ ఆరెంజ్ కోలా
ఉరవళ్లు త్రొక్కే ఉల్లాసపానీయం క్యాంపా
KIRON /C/81/1




**ఎక్కాలు అతి తేలికగ నేర్చుకొను పద్ధతులున్నాయి. ఎక్కాలను రెండు విధములుగ విభజింపవచ్చు.**

పదికి లోపుగల ఎక్కాలు, పదికంటె ఎక్కువ గల ఎక్కాలు. నేను వివరించే పద్ధతులు అలవరచు కొంటే 5 x 5 ఎక్కాలవరకు చదివిన చాలును.

## ఏకాంకముల ఎక్కాలు

9 x 8 తీసికోండి.

రెండు అంకెలు కలిపి 10ని తీసివేయగ వచ్చు అంకెల లబ్ధములోని పదులస్థానము అవుతుంది.

రెండు అంకెల మొత్తం 9 + 8=17 నుండి 10 తీసివేయగా 7 వస్తుంది. ఇది లబ్ధములోని పదులస్థానము అవుతుంది !

రెండు అంకెలను 10 నుండి తీసివేయగ వరుసగా 1,2 లు వస్తాయి. వీటి లబ్ధము 1 x 2=2 ను ఒకట్లస్థానముగ వ్రాయండి.

ఇపుడు 9 x 8=72 అవుతుంది.

మరో ఉదాహరణ 9 x 6 కావలెను అనుకోండి.

రెండు అంకెలు కలపగవచ్చు 9 + 6=15 నుండి 10ని తీసివేయండి. 5 వస్తుంది. దీనిని పదులస్థానముగ వ్రాయండి.

పది నుండి 9,6 లను తీసివేయగా వరుసగ 1,4 లువస్తాయి. వీటి లబ్ధము 1 x 4=4 ఒకట్ల స్థానముగ వ్రాయండి.

ఇపుడు 9 x 6=54 అవుతుంది.

ఇంకో ఉదాహరణ :– 9 x 17 కావలెను అనుకోండి.

రెండు అంకెలు కలుపగవచ్చు 9 + 17=26 నుండి 10ని తీసివేయండి. 16 వస్తుంది. దీనిని వందలు, పదులస్థానముగ వ్రాయండి. అపుడు విలువ 160 అవుతుంది.

రెండు అంకెలను పది నుండి తీసివేయగా 1,–7 లు వస్తాయి. వీటి లబ్ధము 7 అవుతుంది. ఇపుడు 160 నుండి 7ను తీసివేయగా (160–7=153) అను లబ్ధము వస్తుంది.

కావున 9 x 17=153

పై విధముగ పదికి లోపు ఎక్కాలను అన్నింటిని సమయస్ఫూర్తిగా లెక్క కట్టవచ్చును.

## పదికంటె ఎక్కువగల ఎక్కాలు

12 x 13 ను తీసికోండి.

రెండు అంకెలు కలిపి 10 ని తీసివేయండి. దీనిని వందలు, పదులస్థానముగ వ్రాయండి.

రెండు అంకెల మొత్తము 12 + 13=25 నుండి 10 ని తీసివేయండి 15 వస్తుంది. దీనిని వందలు, పదులస్థానముగ వ్రాయండి.

రెండు సంఖ్యలు పదికంటె ఎంత ఎక్కువగలవో తెలిసికోండి. వీటి లబ్ధము ఒకట్లస్థానముగ వ్రాయండి.

12,13 లు పదికంటె 2,3 లు ఎక్కువగ కలవు. వీటి లబ్ధము 6. దీనిని ఒకట్ల స్థానముగ వ్రాయండి. ఇపుడు సంఖ్యల లబ్ధము 156 అవుతుంది.

కావున 12 x 13=156

మరో ఉదాహరణ 17 x 15 కావలెను అనుకోండి.

వీటి మొత్తము 17 + 15=32 నుండి10ని తీసివేయండి. 22 వస్తుంది. దీనిని వందలు, పదులస్థానముగ వ్రాయగ 220 అవుతుంది.

రెండు సంఖ్యలు పది[illegible]టె ఎంత ఎక్కువగ కలవో తెలిసికోండి. రెండు సంఖ్యలు పదికంటె వరుసగ 7,5 లు ఎక్కువగ కలవు. వీటి లబ్ధము 35 వస్తుంది. దీనిని 220 కి కలుపగ 255 అవుతుంది.

ఇట్లే ఎక్కాలు అన్నియు సమయస్ఫూర్తిగ గుణించుకొనవచ్చును. ఈ విధమయిన గమ్మత్తులు విద్యార్థులకు బోధిస్తే ఎక్కాలు మరచిపోయినను ప్రమాదముండదు, ఆసక్తికరముగ నుండును.

— టి. సత్యనారాయణరాజు



# పాపాయికి పుట్టుకతోనే మీరిచ్చిన కానుక- 3 నెలలకు సరిపడే ఐరన్



## 3 నెలలు నిండాక, కేవలం పాలే అతడికి కావలసిన ఐరన్‌ను సమకూర్చలేవు

అతడికి ఇవ్వండి

# ఫారెక్స్

పుష్కలంగా ఐరన్ గలది

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగిపోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందు వల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి."

డాక్టర్ సుభాష్ సి. ఆర్య: "ఇన్‌ఫేంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్"

అంచేత, పాపాయికి 3 నెలలు నిండగానే ఐరన్‌ను ఇచ్చే ఘన ఆహారం ప్రారంభించండి. ఐరన్ అతడి రక్తానికీ, అతడి వ్యాధి నిరోధక శక్తికీ, అతడి శరీర ఆరోగ్యానికీ, అతడి పెరుగుదలకూ, వికాసానికీ అతి ముఖ్యం.

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు ?**

ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారుచేయబడిన ఆహారం ఫారెక్స్. మీ పాపాయి సున్నితమైన జీర్ణ శక్తికి అనువుగా వుండేటట్లు ముందే పచనం చేయబడింది. ఫారెక్స్‌లో ఉన్నాయి— సత్వర పెరుగుదలకు ప్రొటీన్లు; శక్తికోసం కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్ళకోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు. పాపాయికి ఫారెక్స్ ఇస్తే, ఘన ఆహార రూపంలో అతడికి హెచ్చు కాలరీలు లభిస్తాయి. అంచేత పాలు తాగడం తగ్గుతుంది, నమలడం నేర్చుకుంటాడు కూడా. అన్నిటికంటే ముఖ్యంగా, పాపాయి శరీర ఆరోగ్యం, పెరుగుదలకోసం అత్యవసరమైన ఐరన్ పుష్కలంగా కలిగివుంది ఫారెక్స్.




**ఉచితం!** "పాపాయి మొదటి ఏడాది పుస్తకం." కొత్తగా తల్లులైన వారు పిల్లల పట్ల తీసుకోవలసిన శ్రద్ధ గురించి సులభ రీతిలో వివరిస్తుంది. మీ ప్రతి కోసం, 50 పైసల స్టాంపు జతపరుస్తూ ఈ క్రింది చిరునామాకు వ్రాయండి:
పి. ఓ. బాక్స్ నం. **19119,**
**(FAR 15 I)**, బొంబాయి **400 025.**

## డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్
## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-12-244 Tel

సీరియల్

# రాగబంధాలు

## వేమకోటి సీతారామశాస్త్రి

**(గత సంచిక తరువాయి)**

లలిత కళ్ళమ్మట ధారాపాతంగా కన్నీరు వర్షిస్తున్నాది. పద్మ కథ విన్న నీరజ కళ్లు చెమర్చాయి. పురాణాల్ని, పాత సాంప్రదాయాల్ని, పాత చింతకాయ పచ్చడి సూత్రాల్ని నమ్ముకొనిన పద్మ తన జీవితాన్ని యెంత వోర్పుతో బాధతో సరిదిద్దుకుందో, ఆ హృదయంలో యెంత గాయ మయిందో గ్రహించేసరికి నీరజకు భయం వేసింది. కథల్లోనే యిలాంటివి జరుగుతాయి. ఆప్యాయంగా లలిత కళ్లు తుడిచింది. అప్పటికిగానీ లలిత ఈ లోకంలోకి రాలేదు. లలిత హృదయంలో పద్మ ఎంత స్థిరంగా పీటవేసుకుని కూర్చుందో అర్థమయింది.

''ఇప్పుడెక్కడ వుంది లలితా! పద్మను చూడాలి'' అని ఆత్రంగా అడిగింది.

''ఎక్కడో వుంది. అజ్ఞాతంగా వుంది. అపుడపుడూ యేదో రూపంలో గుర్తుకు వస్తుంది. అంతే! అంతకన్నా దాని వివరాలు నా దగ్గర్లేవు'' అంది నిర్లిప్తంగా.

''మరి సతీష్! వాడికి పెళ్లయిందా?''

''వాడికా మరి పెళ్లికాదు. అందమైన అమ్మాయిల జీవితాల్తో బంతాట ఆడుకుంటున్నాడు. వాడిలో వుండే ఆకర్షణ అలాంటిది'' అంది సతీష్‌ను ఈసడించుకుంటూ.

''ఒక్క విషయం అడుగుతాను. ఏమనుకోవు కదా లలితా?''

''అడుగు.''

''మరి నువ్వు ఆమె స్నేహితురాలివి కదా! ఆమెను కాస్త గైడ్‌చేసి గ్రంథం అంతవరకూ రానివ్వకుండా యెందుకు సహకరించలేకపోయావ్'' అంది నిశితంగా, ఆమె ముఖంలోకి చూస్తూ.

లలిత కాస్త తడబడింది. కాస్సేపు మాట్లాడ లేకపోయింది. గదిలో గడియారం టిక్కు టిక్కు శబ్దం తప్ప ఇంకేం వినిపించటం లేదు.

''నిజమే నేను పద్మను గైడ్ చెయ్యలేక పోయినాను. చేయి కాలిన తరువాత ఆకులు పట్టుకున్నాను. అంతా అయిపోయిన తరువాత తెలిసింది. అదీగాక ఏ స్త్రీ తన వ్యక్తిగత జీవితాన్ని తోటి స్నేహితురాలితో చెప్పకోదు. అది సహజం'' అంది నిట్టూరుస్తూ.

''నేను నీ వాదనను సమర్థించలేను. స్త్రీకి వ్యక్తిగత జీవనం అంటూ యేమీ వుండదు. అనుభవాలు వేరుగా వుంటాయి. వివాహ విషయంలో మాత్రము చాలావరకూ దాపరికం వుండదు. వివాహం వ్యక్తిగత జీవితానికి సంబంధించిన దయినా అది కేవలం సాంఘిక జీవనంతో ముడిపెట్టుకునే వుంటుంది. ఆ ముడిని ఎవ్వరూ విప్పలేరు. తప్పించ లేరు'' అంది.

''అయితే పద్మ విషయంలో ఎందుకిలా జరిగింది'' నీరసంగా అడిగింది లలిత ఆమెవేపు చూస్తూ.

''నేను సతీష్‌ను తప్పు పట్టను. పురుషుడు. అతనికి అన్నీవున్నాయి. అతని జీవితం వడ్డించిన విస్తరి. సెక్సు ధోరణి కొంతమందిలో విపరీతంగా వుంటుంది. ప్రతీ పురుషుడు ఆకర్షణకు గురి అవుతాడు. తన అవసరం కోసం, తన కోరిక కోసం చెయ్యరాని ప్రమాణాలు చేస్తాడు. అవసర మయితే ఆడదాని కాళ్లమీద పడిపోతాడు. నన్ను కనికరించు దేవీ అని ఏడుస్తాడు. పద్మ బలైపోయింది చేజేతులారా చేసుకుని. సాహిత్యం చదివింది. జీవితంలో మనుషుల్ని చదవటం నేర్చు కుంది. ఎక్కడో అపశృతి ఆమె జీవన వీణను, యీ తీగెల్ని తెంపేసింది. పురుషుడ్ని ఆడది అనేక రకాలుగా నమ్మకుండ వుండాలి. అతన్ని పరిశీలించాలి.

**జరిగిన కథ—4 :** ఆ ఆఫీస్‌లో కొత్తగా స్టెనో కమ్ క్లర్క్‌గా జాయిన్ అవుతుంది మిస్ నీరజ. మేనేజర్ శివకుమార్ ఆమెపై ఒక ప్రత్యేకమైన అభిమానాన్ని చూపిస్తుంటాడు. అక్కడే గుమాస్తాగిరి చేస్తున్న రాంబాబు దయనీయమైన పరిస్థితిని చూసిన నీరజ అతనికి ఆర్థిక సహాయం చేస్తుంది. ఓనాడు బస్సులో పరిచయ మైన లలిత ఇంట్లో ఓ రూములో వుంటుం టుంది నీరజ. నీరజను ప్రేమిస్తున్నాననీ, ఆమె బాధ్యతలను తను స్వీకరిస్తాననీ, పెళ్లి చేసుకుందామనీ శివకుమార్ ఆమెను అడుగగా, నీరజ కొంత టైం కోరుతుంది. జీవితంలో చావుదెబ్బ తిన్న తన స్నేహితురాలు పద్మ గత చరిత్ర గురించి నీరజతో చెప్తుంటుంది లలిత. తన మేనేజర్ సతీష్ పుట్టినరోజునాడు అతను కోరిన కోర్కె — అతనితో సినిమా ప్రోగ్రాం, ఆ తరువాత అతని ఇంట్లో భోజనం చేయటానికి అంగీకరించుతుంది పద్మ. సతీష్‌ను నమ్మి అతనికి తన సర్వస్వమూ అర్పించుకొంటుంది పద్మ. ఫలితంగా గర్భవతౌతుంది. ఆమెకు తెలియకుండా సతీష్ ఎబార్షన్ చేయిస్తాడు. తరువాత అతని నిజస్వరూపం తెలుసుకొని కుమిలిపోతుంది. సతీష్ ఆమెను ఉద్యోగంలోంచి తీసివేస్తాడు. ఇప్పుడు మరో ఉద్యోగం సంపా దించుకొని గత జీవితాన్ని మరిచిపోవటానికి ప్రయత్నిస్తూంటుంది పద్మ.

ఆ తర్వాత ఏదయినా నిర్ణయం తీసుకోవాలి'' అంది దృఢంగా నీరజ.

''ఇది ప్రతీ స్త్రీ విషయంలో జరుగు తుందంటావా?''

''తరం మారింది. వ్యవస్థ మారింది. మనుషుల ఆలోచనా దృక్పథాలు మారుతున్నాయి. మారుతున్నా యేమిటి మారాయి. వెనక తరాలకన్నా మన స్త్రీలు విద్యారంగంలో ఎంతో ముందంజ వేసారు. వెనక తరాల్లో మనవాళ్లు వంటిల్లు కదిలేవారు కాదు. ఇప్పుడు ఒంటరిగా విదేశాలు ప్రయాణం చేస్తున్నారు. ఇంతగా యెదిగిపోయిన సమాజంలో స్త్రీ తన విచక్షతా దృక్పథాన్ని వినియోగించుకోవాలి. ఆమె అలా చేయకపోతే ఆమెదే తప్పు.''

''ఇదే నీ విషయంలో అయితే ఏం చేస్తావ్?''

నీరజ నవ్వేసింది తేలికగా. అయినా ఆమె మనస్సు తీవ్రంగా ఆలోచించింది.

''నా విషయంలో అంతవరకూ రాలేదే లలితా.''

''ఏమో. ఎవరు చెప్పగలరు. పద్మ గూడా నీలాగే అంది.''

''నువ్వేదో మనస్సులో వుంచుకుని మాట్లాడు తున్నావు ... ఇక్కడ నా జీవితంలో నీకు చెప్పని రహస్యమంటూ లేదు. అసలు నీకు యెందుకు యిలాంటి అనుమానం కలిగిందో ముందు చెప్పు'' లలిత చుబుకాన్ని యెత్తి, ఆమె కళ్లలోకి చూస్తూ అడిగింది. లలిత కళ్లల్లో నీళ్లు తిరగటం చూసి విచలితురాలైంది.

''నువ్వు అసలివాళ పద్మ జీవితాలోటి బాగా కలతపడ్డావు. నిన్ను మరింత వేధించి కళ్లత పెట్టటం, సమాధానాలు రాబట్టటం మంచిదికాదు. మళ్లారేపు మాట్లాడుకుందాం. నిద్రపోదాం'' అంది లలిత. అచేతనంగానే లేచి రెండడుగులు వేసింది. మళ్లా నీరజ పిలుపు విని ఆగిపోయింది.

''ఈ అస్తవ్యస్తమైన ఆలోచనలతోటి, నువ్వు వొంటరిగా పడుకుంటే మరి నిద్రపోవు. నా దగ్గరే పడుకుందువుగాని'' అంటూ నీరజ బెడ్‌లైట్ వేసింది. వాస్తవానికి నీరజ, లలితలు పడుకున్నా నిద్రపట్టలేదు. ఆలోచనల వలయంలో చిక్కుకుని, ఆమె తెల్లవార్లూ మేలుకునే వుంది.

* * *

ఆ రోజు ఆదివారం. సాధారణంగా ఆదివారం అందరికీ ఆనందంగానే వుంటుంది. ఆ రోజు వుద్యోగులు యెంతో హాయిగా గడిపేస్తారు.

ఎనిమిది గంటలు కావస్తున్నా నీరజ నిద్ర లేవలేదు. సాధారణంగా ఏడు ఆ ప్రాంతంలో లేస్తుంది నీరజ. స్నానం చేసి తల దువ్వుకుంటూ వచ్చింది లలిత, చిన్న హిందీ సినిమాపాట కూనిరాగం తీసుకుంటూ.

''నీరజా... నీరజా. రాజకుమారిగారూ... తెల్లవారెను... కోడి కూసెను... కాదు కాదు... కోడి కూసెను... తెల్లవారెను... పాలు వచ్చెను... కాఫీ వచ్చెను... మేలుకో... మేలుకో'' అంటూ లేపింది, నీరజను. నీరజ వొక్కసారి కళ్ళు తెరచి, వొళ్ళు విరుచుకొని బద్ధకంగా పడుకుంది. లలితకు కోపం వచ్చింది.

''ఎంత ఆదివారమైనా నిద్రకే అంకితమైపోతే



తల్లీ ! ఈరోజు మనకు చాలా కార్యక్రమా లున్నాయి. ముఖ్యంగా మనం ఈరోజు 'బాబు' ఇంటికి వెళ్దాం అనుకున్నాం కదుటే తొందరగా లేవమ్మా... చక్కటి ఉప్మా, చిక్కటి కాఫీ యిస్తాను'' అంటూ కుదిపి లేపింది.

నీరజకు నిద్రబద్ధకం వదిలిపోయింది. చెదురు మదురుగా ఫేన్‌గాలికి, నుదురుమీద చెదురుతున్న నీలికుంతలాలను వెనక్కు నెట్టింది. చక్కగా ఆవులింత తీసింది.

''లేలేవే! మహాతల్లీ!'' అంటూ రెక్క పట్టుకుని నిల్చోబెట్టింది. నీరజ లలితను చూసింది. నిన్న రాత్రి ఆమె మనస్సులో రేగిన తుఫాన్ అంతటి సంఘర్షణ ఛాయలు ఆమెలో యేమీ కన్పించలేదు. అసలు యేమీ జరగనట్లే, మామూలు మనిషయి పోయింది. నీరజకు ఆశ్చర్యం వేసింది.

''ఇంక నీకు దండోపాయం వేస్తేనేగాని, నువ్వు త్వరగా తయారయ్యేటట్లు లేవు'' అంది గదిలో చీపురుకట్ట వెతుకుతూ.

''వద్దులేవే తల్లీ! తొందరగా తయారవు తాను'' అంటూ చకచక నడచింది నీరజ పెరట్లోకి.

స్నానం చేసి వచ్చేసరికి రెండు ప్లేట్లు ఉప్మా ప్రత్యక్షమయింది. ఉప్మా అంటే నీరజకు ఇష్టం. అందువలన ప్రతీ ఆదివారం స్పెషల్‌గా మసాలా వుప్మా చేస్తుంది.

''చాలా థాంక్సు లలితా. రేపు నాకు పెళ్ళయితే, మా వారు వంటచేసి పెడతారో లేదో తెలియదుగానీ, నువ్వు మాత్రం వేళకి అన్నీ సిద్ధం చేస్తున్నావు. నీలాంటి మొగుడు దొరకాలంటే యెంత అదృష్టం చేసుకోవాలో'' అంది ఉప్మా స్పూన్‌తో తీసుకుని తింటూ.

''ఫూల్ నేన్నీకు భర్తనా! అయినా అదికాక భర్తచేత నీవు వంట చేయిస్తావా? అతని చేత సేవలు చేయిస్తావా?'' అరచింది లలిత.

''కాలం మార్పుల్లో యేమేమి జరుగుతాయో యెవడు చూడొచ్చారు లలితా.''

''అయితే పిల్లల్ని గూడా వాగవారే ...!'' లలితా, నీరజా యిద్దరు నవ్వుకున్నారు, కాఫీ త్రాగుతూ.

''లలితా! ఈ రోజు యింకొకరి యింటికి వస్తానని మాట యిచ్చానే. పోని నువ్వొక్కర్తివే వెళ్ళిపోకూడదూ. వచ్చే ఆదివారం నేను వస్తాను'' అంది.

''అదేమిటే అలాగంటావు. నీకు అతను అభిమాన రచయితే కదా. నేను ఆదివారం ఉదయం వాస్తున్నానని వుత్తరం రాసాను. ఆయన మన కోసం యెదురు చూస్తూంటాడు. కావాలంటే ఆ యింకొకరి యింటికి మధ్యాహ్నం వెళ్ళు. వెళ్ళి యే రాత్రికో మళ్ళా రా. ఎవరు కాదంటారు. నీవు రాకపోతే నేను కాన్సిల్ చేసుకుంటాను'' అంది లలిత నిష్ఠూరంగా. లలితను నిరుత్సాహపరచటం యిష్టం లేకపోయింది. తన ప్రోగ్రాం మధ్యాహ్నానికే వాయిదా వేసింది.

''అయితే యిలాగే వెళ్ళిపోదామా'' అంది నీరజ.

''అంటే.''

''అదిగాదే. రాజుల దగ్గరికీ, రచయితల దగ్గరికీ వుట్టిచేతులతో వెళ్ళడం సమంజసంగా వుండదే.''

''అయితే యేం కొందాం.''

''ఏదైనా చిన్న ప్రజంటేషన్.''

''ఆయన కెంత వయస్సు వుంటుందంటావ్'' అంది నీరజ.

''అసలు చూడలేదే ఆయన్ని నేను'' అంది లలిత.

''రచనల్నిబట్టి ఆ మాత్రం అంచనా వేయలేవా?''

''రచనలో వున్న శిల్పాన్నిబట్టి, అతని వయస్సు నలభైకి పైగా వుండొచ్చనుకుంటాను'' అంది లలిత అంచనావేస్తూ.

''పెండ్లయిందో లేదో'' అంది సాలోచనగా.

''పెండ్లి సంగతి యెందుకే ఫూల్! నువ్వేం చేసుకుంటావా?''

''అదిగాదే. పెండ్లయితే వారి శ్రీమతికి ఒక పట్టు రవికెలగుడ్డ గూడా ప్రజెంట్ చేద్దాం'' అంది నీరజ.

''అదిగాదే. ముందు ఆయనతో పరిచయం అయ్యాక వారి కుటుంబం అన్నీ చూసుకుని, ఏం

# హై పవర్ సర్ఫ్ అమిత తెల్లగా ఉతుకుతుంది...

అమిత తెల్లగా, కనువిందుగా.

మీ బాబు బట్టలు మురికి చేసుకోవడంలో ఘటికుడా? ఆ మురికి వదలగొట్టడానికి మీకూ ఘనమైనదే కావాలి మరి. అదే హై పవర్ సర్ఫ్.

హై పవర్ సర్ఫ్‌లో ఉంది అతి శక్తివంతమైన ఫార్ములా. దానిలోని హెచ్చు ఉతికే శక్తి మురికినీ, జిడ్డు మరకల్ని మటుమాయం చేస్తుంది. బాగా మాసిపోయిన దుస్తుల్ని కూడా తెల్లగా మిలమిల మెరిసేలా చేస్తుంది సర్ఫ్. సర్ఫ్, రంగు బట్టలకు కూడా మంచిది. వాటిని పరిశుభ్రంగా, కాంతివంతంగా ఉంచుతుంది. ఇంటిల్లిపాది బట్టలకూ ఉతుకులో అదనపు తెల్లదనం, కాంతీ ఇస్తుంది హై పవర్ సర్ఫ్. ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదుకు సర్ఫ్‌నే వాడటంలో మరి ఆశ్చర్యం ఏముంది గనక ?




**ఎక్కువ మంది తల్లులు మరే ఇతర వాషింగ్ పౌడర్‌కు బదులు సర్ఫ్‌నే వాడతారు.**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-SU. 220-203 TL

కొనాలో నిర్ణయించుకుని మరొకసారి యింటికి వెళ్లి ప్రెజెంట్ చేద్దాం. అందాక కొంచెం యాపిల్ పండ్లు, బిస్కెట్లు తీసుకెడదాం'' అంటూ లలిత పరిష్కారం చేసినమీదట ఇద్దరు బయలుదేరారు.

''ఇల్లెక్కడో తెలుసా ?'' అంది నీరజ రిక్షాలో.

''ఇంటి అడ్రసు నాకు తెలుసు. ఈ పట్టణంలో నిన్ను మళ్లా తప్పిపోకుండా ఇంటికి చేర్చే బాధ్యత నాది'' అంది.

రిక్షా సరాసరి, గమ్యానికి తీసుకువచ్చేసింది. లలిత కార్డులో ఎడ్రసు చూసింది. అవును ఇదే వీధి. ఇద్దరూ కలిసి ఆ యింటికి వెళ్లారు. ఇంటి తలుపు వేసివుంది. నీరజకు, ఆశ్చర్యం వేసింది. లలిత చేతిలో ఎడ్రసు తీసుకుని ఆతృతగా చూసింది. అదే యిల్లు. అదే యింటి నెంబరు. అదే ఎడ్రసు.




అడ్రసు కరక్టే. సందేహం లేదు. ఇదే ఆ యిల్లు. మరి 'బాబు ...' నీరజకు ఆత్రంగా వుంది తర్వాత సంఘటన చూడాలని.

తలుపు తట్టారు. కొన్ని క్షణాల తరువాత తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా స్ఫురద్రూపి అయిన యువకుడు. నీరజ ఆశ్చర్యపోయింది. షేవ్ చేసుకుని రాంబాబు యెంతో బాగా అందంగా కన్పించాడు. ఆ కళ్లలో మాత్రం అక్కడక్కడా కొంచెం కొంచెం దైన్య చిహ్నాలు కన్పిస్తున్నాయి. లలిత అప్రతిభురాలై చేతులు జోడించింది.

''రండి లలితగారూ ! మీరు వస్తారని రాసిన వుత్తరం అందింది. రండి లోపలికి రండి. మీరు నీరజగారు కలసి వచ్చారా ! లేక ఇక్కడ కలిసారా'' కాకతాళీయంగా అడిగాడు.

''లేదండీ కలిసే వచ్చాం. నీరజ మా ఇంట్లోనే వుంటోంది'' అంది.

ముగ్గురూ కలిసే రీడింగ్ కమ్ బెడ్‌రూమ్‌లో కూర్చున్నారు. గదిలో దేవదారు చెక్కతో చేసిన టేబిల్‌మీద కాగితాలుమీద పెన్ను వుంది. గదిలో అక్కడక్కడా రవీంద్రనాథటాగూరు, రామకృష్ణ

# రాగబంధితులు

పరమహంస, వివేకానందుల చిత్రపటాలు వ్రేలాడుతున్నాయి. వెదుళ్లతో తయారుచేసుకున్న రాక్‌లో పుస్తకాలు పొందికగా అమర్చబడ్డాయి.

''అయితే 'బాబు' అన్న రచయిత మీరేనన్న మాట'' అంది లలిత ఆనందంగా, టేబిల్ మీద ఆపిల్ పండ్లు పెడుతూ.

''నేను చాలా రహస్యంగా వుంచుకున్న పేరు యివాళ మీకు తెలిసిపోయింది. అందులో ఆడవాళ్లు. వాళ్లనోట్లో నువ్వుగింజ నానదు అంటారు అన్నాడు'' నవ్వుతూ నీరజవేపు చూస్తూ. నీరజకు రాంబాబుమీద చిరుకోపం వచ్చింది.

''నేనే 'బాబు' అన్న రచయితని నాకు చెబితే... ఇంతకాలంగా దాచుకున్నారు'' అనేసింది నీరజ కొంచెం చిరుకోపంతో.

''నిజమేనండి నీరజగారు. పొరపాటే. అయితే నేను రచయిత నండోయ్ అనే బాజా వాయించుకోవటం నా కిష్టంలేదు. బాజా వాయించుకోవాల్సినంత గొప్ప రచయితను మాత్రం కాదు. ఏదో వూసుపోక రాసుకున్న రచనలే కాని ...'' సగంలో ఆపి ''అన్నట్లు మర్చిపోయాను. కాఫీ డికాక్షను వేశాను. పాలు మరగబెట్టి కాఫీ తీసుకువస్తాను. ఈలోగా మీరిద్దరూ కాస్తసేపు బాతాఖానీ కొట్టండి'' అన్నాడు.

నీరజ లేచింది.

''నో ! నో! మీరిద్దరూ మాట్లాడుతుండండీ. నేనే కాఫీ కలిపి తీసుకువస్తాను. లలిత మీతో ఎన్నో సాహిత్య విషయాలు మాట్లాడాలని వచ్చింది'' అంటూ టేబిల్‌మీద ఆపిల్ పండ్లను వంటింట్లోకి తీసుకు వెళ్లిపోయింది నీరజ. నీరజకు వాళ్లింట్లో వున్న చనువుకు ఆశ్చర్యపోయింది లలిత.

''చాలా మంచి స్నేహితురాలండీ నీరజగారు. ఆమె సహాయం లేకపోతే, ఈపాటికి నేను మా నాన్నగార్ని దక్కించుకోలేకపోయి వుండేవాడిని'' అన్నాడు రాంబాబు.

''నీరజ చాలా మంచి పిల్లండి'' అంది లలిత.

ఇద్దరి మధ్యా కాస్సేపు నిశ్శబ్దం. ఇద్దరకు మాటలు కరువైపోయాయి.

''ఇప్పుడు యెలాగ వున్నారు లలితగారూ !'' రాంబాబు అడిగాడు.

''బాగానే వున్నాను. స్టెనోగా పనిచేస్తున్నాను. జీతం అవీ బాగానే వున్నాయండి'' అంది.

''జీవితంలో యెన్నో కష్టాలు పడ్డారు. ఇప్పటికయినా మీరు ప్రశాంతంగా జీవిస్తున్నారు అంటే నాకు ఈ రోజు చాలా సంతోషంగా వుందండి'' అన్నాడు రాంబాబు.

''నిరాశా దీపానికి ఆశల చమురుపోసి, నాలాంటి వారికి వూపిరి పోసి బ్రతికిస్తున్నవి మీలాంటి వారు రాసిన రచనలే కారణమండీ రాంబాబుగారు'' అంది గాద్గదికంగా.

''అవునండీ. ఈ చీకట్లూ, ఈ జడత్వం ఇలాగే మనిషిని ముసురుకొని వుండవు. రేపటి వుదయం కోసం, రేపటి వసంతకాలం కోసం ఈనాటి జీవితం బాధల్తో నయినా బ్రతకక తప్పదు. చచ్చిపోయి మనం సాధించుకునేది యేమి వుందండి చెప్పండి'' అన్నాడు రాంబాబు.

నిజమే నన్నట్లుగా తలూపింది లలిత. ఆమె కళ్లలో కృతజ్ఞత కన్పిస్తోంది. ప్రశంస కన్పిస్తోంది. ఆమెకు యేదో సందేహం వచ్చింది.

''ఏదో అడుగుదామనుకుంటున్నారు. అడగండి'' అన్నాడు రాంబాబు ఆమె ముఖంలో భావాలను చదువుతూ.

''అయితే ఈ అన్యాయాలు, అక్రమాలు, యివన్నీ జీవితం భరించవలసిందేనా. వీటికి విముక్తి లేదా ? అవి నాశనం కావా ?'' అని అడిగింది ఆవేశంగా. నవ్వాడు రాంబాబు.

''వ్యక్తి యెంత సమర్థుడయినా, నిజాయితీగల మనిషయినా కొన్ని సమయాల్లో అన్యాయం, వాడిచేత నోరు మూయిస్తుంది. కానీ ఎంతోకాలం, అది రాజ్యం చేయలేదు. ఎప్పుడో ఒకప్పుడు పతనం అవక తప్పదు. పశ్చాత్తాపం పడక తప్పదు జడత్వం మనిషిని కృంగదీస్తే ఇది మనిషిని రెచ్చగొడుతుంది. రగిలిస్తుంది'' అన్నాడు. ఎందుకడిగిందో ఆ ప్రశ్న అతనికి తెలుసు.

వంటింట్లోపల మాటలు వినబడుతున్నాయి.

''ఈ పూటయినా మా యింట్లో భోజనం చెయ్యమ్మా'' అంటోంది పార్వతమ్మగారు.

''లేదండీ ! ఇంకోసారి భోజనం చేస్తాను. నేను, యింకో మా స్నేహితురాలు వచ్చాం. ఆమెగారు మీ అబ్బాయి కోసం వచ్చింది. మీ అబ్బాయిగారు మంచి కథలు బాగా రాస్తారుటండీ'' అంది. కాఫీగ్లాసులో స్పూన్ చప్పుడవుతోంది.

''అవునమ్మా! చిన్నప్పట్నించీ వాడు రాసేవాడు. ఈ మధ్య మరీ రాత్రుళ్లు ఎక్కువగా రాస్తున్నట్లు కన్పిస్తోంది. వాళ్ల నాన్నగారు అప్పటికీ, పడుకోరా ఆరోగ్యం దెబ్బతింటుందన్నా మానకుండా వున్నాడు'' అంది దిగాలుగా.

''రాయనివ్వండి... మీ అబ్బాయి ఆరోగ్యం పోగొట్టుకుని రాసేంత అమాయకులు కారు. ఇలాగే

# రా గ బం ధి తు లు

కానీ యెప్పుడో సినిమా రచయితయిపోతారు'' అంది కాఫీ డికాక్షనులో పాలు కలుపుతూ.

''మా బ్రతుకే సినిమాల్లావున్నాయి'' అన్నాడు నిట్టూరుస్తూ రాంబాబు వంటింట్లో మాటలు విని. నీరజ వచ్చేసింది.

''ఏమిటి ఇద్దరూ సీరియస్‌గా కూర్చున్నారు. సాహిత్య చర్చ అయిపోయిందా'' అంది ఇద్దరికీ చెరొక గ్లాసు కాఫీ యిచ్చి కూర్చుంటూ. నీరజ నుదుటిమీద ముత్యాల్లాంటి చిరుచెమటలు. కొంచెం అలసట కన్పించింది.

''నువ్వొస్తే చర్చ మొదలు పెడదామని'' అంది కాఫీ త్రాగుతూ.

''లలితా ! దేనిమీద చర్చ'' ఆసక్తికరంగా అడిగింది నీరజ.

''పంచదారలేని కాఫీమీద'' అన్నాడు రాంబాబు కాఫీ చప్పరిస్తూ.

''అదేమిటి నాకు సరిపోయిందే'' ఆశ్చర్యకరంగా లలిత నీరజవేపు చూసింది.

''అబద్ధాలాడే అబ్బాయిలకు అమృతం లాంటి కాఫీ ఇవ్వగూడదు.'' బుంగమూతి పెట్టింది.

''ఏది అబద్ధమో, యేది నిజమో తెలుసుకోకుండా అమ్మాయిగారు అలాంటి శిక్ష ఆశ్రితులకు వేయగూడదు. అయినా నా వల్ల ఏమైనా పొరపాటు జరిగితే దాసరి తప్పులు ...'' నవ్వేశాడు రాంబాబు మాట్లాడుతూనే. నీరజ టేబిలుమీద పుస్తకాలు ప్రక్కన పెట్టి, చక్కెరస్పూన్ కాఫీలో వేస్తూ —

''చక్కెరతో సరి ... సరేనా'' అంది అతని కళ్లల్లోకి చూస్తూ. ముగ్గురూ నవ్వేశారు.

''ఇప్పుడు చెప్పండి. కాఫీ త్రాగేశాను కదా. ఇంక మెదడు చురుకుగా పరిగెడుతుంది'' అన్నాడు హుషారుగా.

ఇద్దరమ్మాయిలు యేం మాట్లాడాలో తెలియని పరిస్థితుల్లో వుండిపోయారు.

''వంటయిందండీ?'' లలిత ప్రశ్న.

''అయిందండీ ...''

''సాహిత్యం చర్చలో ఒక భాగమా ఇది'' అన్నాడు నవ్వుతూ.

''మీరేం రాస్తున్నారూ ?'' అడిగింది నీరజ.

''తలకు కొబ్బరినూనె. వొంటికి లక్స్ సుప్రీమ్ సోప్'' అన్నాడు నవ్వుతూ. నీరజకు నవ్వు వచ్చింది.

''ఇలా చేస్తే నవల తయారయిపోతుందా ?'' అంది లలిత, నీరజను వెనకేసుకువస్తూ.

''మీకయితే అలా తయారవవు. ఆడ రచయిత్రుల, వంటింట్లో కూర్చుని, కుడిచేత్తో పొయ్యి విసురుతూ, ఎడంచేత్తో కలం పట్టుకుంటే, దానంతటదే, వ్యాసుడు భారతం చెబితే, వినాయకుడు రాసిన గంటంలా వంట పూర్తయ్యేసరికి ఒక నవల తయారయిపోతుంది'' అన్నాడు.

''మీ మగవాళ్లకి ప్రతీది అసూయేనండీ'' అంది నీరజ.

''అసూయంటే అగ్నిలాంటిది. అగ్ని యిల్లు కాల్చేస్తుంది. మనిషిని బూడిద చేస్తుంది. అదే అగ్ని మనిషికి ఇంత అన్నం వుడికించి పెడుతుంది. మనిషికి వెచ్చదనం యిస్తుంది. ఇందులో నాది ఎలాంటి అసూయంటారు ?''

''ఏమో ! మీకే తెలియాలి.'' లలిత సమాధానం యిచ్చింది.

''అసూయ ఆడవాళ్ల తోబుట్టువు. నేను లోకవృత్తం విశదీకరించాను. అంతేగానీ సాటి రచయిత(త్రి) పట్ల నాకెంతో గౌరవం వుంది. అది సరేగాని మీరు **నాకు** ఒక విషయంలో మాట యివ్వాలి'' అడిగాడు ప్రాధేయపూర్వకంగా. ఇద్దరమ్మాయిలూ, అతని ముఖం చూసారు. ''చెప్పండి'' అన్నారు ముక్తకంఠంతో.

''దయవుంచి నేను 'బాబు' అన్న పేరుతో రచనలు చేస్తున్నానన్న సంగతి మీరు ఎక్కడ తెలియజేయవద్దు. అలా తెలియజేస్తే ఈమాత్రం నోటి ముందు వున్న కూడు, గుడ్డా తీసేసినవాళ్లవుతారు'' అన్నాడు ముక్తకంఠంతో. దిగ్భ్రాంతి చెందారు.

''అంటే'' అంది లలిత.

''ఈమాత్రం వుద్యోగం కూడా వూడుతుంది'' అన్నాడు దిగులుగా.

''ఎందుకని ?'' దృఢంగా ప్రశ్నించింది నీరజ.

''అది అంతే !''

''అంతే అంటే యెలాగ. మాకు విషయం తెలియాలి'' అంది మంకుపట్టుతో నీరజ.

''మనకు నిత్య జీవితంలో ఎంతోమంది స్నేహితులు, హితులూ తారసపడతారు. నాలాంటి వాడికి అందర్నీ ఆదరించబుద్ధి వేస్తుంది. కొందరు మాత్రం అదోరకంగా తయారయిపోయి విపరీతమైన ద్వేషం, మనుష్యులమీద అసహ్యం పెంచుకుంటారు. ఈ పరిణామానికి బుర్ర బద్దలుకొట్టుకున్నా కారణం కనిపించదు. నా జీవితంలో నన్నదోరకంగా అసహ్యించుకునే మనుషుల కొందరు వున్నారు. నీరజగారికి తెలుసుగూడా'' అన్నాడు.

''ఎవరు నీరజా'' అడిగింది లలిత.

''అన్నారులే ఒకతను. రాంగ్ నెంబర్ వన్'' అంది నీరజ రాంబాబునుండి వినాలని ఆశిస్తూ.

''అసలు వాస్తవానికి రచన చేయటం ఎంతో కష్టమయిన పని. రచయిత తను చుట్టూ వున్న వాతావరణం, జీవనాడిగా తీసుకుని రచన సాగిస్తాడు. అది సక్రమంగా కుదరనినాడు స్త్రీ కన్నా యెక్కువగా ప్రసవవేదన పడతాడు. వాస్తవికతను ప్రతిబింబించే రచనల్లో వ్యక్తులు తన వూహకందినంత మేర నిజజీవితాల్ని తీసుకుని కాల్పనిక దృక్పథం కొంత జోడించి రచన తయారుచేస్తాడు. అందు వలననే ఆ రచయితని తెలిస్తే పుచ్చకాయ దొంగల్లా భుజాలు తడుముకుని కొందరు నా వుద్యోగాన్ని ఏదో మిషపెట్టి, ఒక నెల నోటీసు యిచ్చి తీసేయడానికి ప్రయత్నించవచ్చు'' అన్నాడు రాంబాబు. ముఖ్యంగా శివకుమార్‌ని దృష్టిలో పెట్టుకుని అంటున్నట్లుగా గ్రహించింది నీరజ.

''ఇన్ని అన్యాయాలూ, యిన్ని అక్రమాలు ఖండించి రాస్తుంటారు. వ్యవస్థను దుయ్యబడుతూ వుంటారు. సమాజానికి యేదో ఒక సందేశం యివ్వాలని ఉబలాట పడుతూంటారు కదా. మీరు నిజజీవితంలో అన్యాయాలను, అక్రమాలను యెదుర్కొనడానికి యెందుకో వెనుకంజ వేస్తారు'' అడిగింది నీరజ.

''నీరజా ! జీవితం వేరు. బ్రతుకు వేరు. నాకుండే సమస్యలు నా మానసిక ధైర్యాన్ని బలవంతంగా అణిచేస్తోంది. వాస్తవానికి ఈ వుద్యోగం లేకపోతేయెలా బ్రతకగలం. నేను, మీరు చూసిన మా కుటుంబం'' అడిగాడు దీనంగా. జాలేసిందిలలితకు.

''ఇంకో వుద్యోగం దొరకదా'' అడిగింది నీరజ.

''దొరుకుతుంది, దొరకదు ఎలా చెప్పగలం. ఇది న దురదృష్ట జీవితం. బంగారం పట్టుకుంటే మన్ను అవుతుందేమోనన్న భయం వేస్తోంది.''

''పోనీ రచయితగా స్థిరపడిపోండి. ఇప్పుడు బాగా రాస్తున్నారుకదా. రచనలవల్ల డబ్బు సంపాదించవచ్చుకదా'' అంది లలిత.

**(ఇంకా వుంది)**

## ప్చ్ ! ఉగాది !

తెనుగువాడి ఉగాది
సగటు తెల్గువాడికి
తెలిసినంత వరకు
వేపపువ్వు మామిడి
కాయ పచ్చడి వరకే !

పంచాంగం వినడం
లాంటి తమాషాలన్నీ
కార్టూనిస్టుల కోసం
మిగిలిపోయిన ఐడియాలు !

అదేం బ్యాడ్‌లక్కో
ఏప్రిల్ నెల నుంచే
రైలు ఛార్జీలు గట్రా
పెరిగిపోతు ఉంటాయి !
ఎండలు మండిపోతూ
ఉంటాయి : కొంపలు
అంటుకోడం మొద
లౌతూ వుంటుంది !

ఉగాదికి బోనస్సులు,
స్వల్పకాలిక ఋణాలు
ఎవ్వరూ యిప్పించరు
పిల్లకాయల పరీక్షల
ఖర్చులు పులిమీద పుట్ర

అందువల్ల ఆ మాత్రం
''తడి'' కూడా వుండదు

ఈసారి ఉగాది
ఆదివారం నాడొచ్చింది
అంచేత — స్పెషల్ మార్నింగ్
షోలకూడా ఛాన్స్‌లేదు. ప్చ్ !!

— సప్తశైలేష్

## ఏప్రిల్ 9న త్యాగయ్య

రామభక్తి సామ్రాజ్యానికి అధిపతియై, మనోవాక్కాయ కర్మలలోనూ శ్రీరాముని సన్నిధి సేవే సకల సంపదలకంటే అమూల్యమైనదని భావించిన త్యాగయ్య — మహారాజ సందర్శనంకన్నా, వారిచ్చే కానుకలకన్నా రామచంద్రుని పూజే ప్రధానమని రాజ దర్శనానికి త్రోసిరాజని ఇంటికి రావడం త్యాగయ్య అన్న జపేశానికి కంటకప్రాయమైంది. "ఆ యొక్క రాజదర్శనం త్రోసిరాజని, రాముని పూజ కోసం వస్తావా ? ఏం చూసుకొనిరా నీకా పొగరు, ఆ కండకావరం ? ఏం, నాన్నగారికంటే గొప్పవాడివా ? కొత్తగా కొమ్ములు మొలిచాయా ? ఆయనతో చిన్నప్పుడు రాజసభకు వెళ్ళలేదా ? అక్కడ రామాయణం చదవలేదా ?" అన్నాడు జపేశం.

"అప్పుడు నాన్నగారు రమ్మంటే వెళ్ళాను," వినమ్రంగా అన్నాడు త్యాగయ్య.

"ఇప్పుడు అన్నగారు వెళ్ళమంటున్నారు వెళ్ళు," ఆజ్ఞాపించాడు జపేశం. దానికి సమాధానం చెప్పకుండా తమ్ముడు తల దించుకోవడం చూసి, "వెళ్ళరా ! ఆ యొక్క తండ్రంతటివాడిని — నన్ను కాదంటే ఆ యొక్క రాముడు కూడా మెచ్చుకోడురా. రాముడి మాటని వాడి తమ్ముళ్ళు ఇలాగే త్రోసిపారేశార్రా ?" అన్నాడు.

ఈలోగా జపేశం భార్య గంగ వచ్చి, కల్పించుకుంది. "అదేం కాదండీ. ఆ రాజుగారు ఏమన్నా చదివిస్తే, అందులో సగం మనకి తగలెయ్యాలని గుబులు. మీరూ, నేనూ చచ్చాక వెళ్ళి నాలుగూ తెచ్చుకుంటారు" అగ్నిలో ఆజ్యం పోస్తున్నట్టుగా అంది.

"త్యాగూ, నిన్నే! వట్టి చేతులతో వచ్చి ఆ రాముడికి ఏం పెట్టి పూజ చేస్తావురా ? నైవేద్యానికి ఏముందిరా — బెల్లంముక్కా, అల్లం ముక్కా ?" దెప్పిపొడిచాడు జపేశం.

"ఏమీ లేకపోతే, నా కన్నీళ్ళతో కాళ్ళు కడుగుతాను... నా పాటతో పూజ చేసుకుంటాను." ఎంతో అణకువగా త్యాగయ్య సమాధానమిచ్చాడు.

"చేసుకోరా, అలాగే చేసుకో. ఆఖరికి ఆ కన్నీళ్ళే నీకు మిగిలేవి... నీకూ, నీ రాముడికీ కూడా ఈ పూట పస్తే. నా కొంపలోకి రాకు. అక్కడే అఘోరించు," అని భార్యను తీసుకొని విసురుగా లోపలికెళ్ళి, భళ్ళున తలుపేసుకున్నాడు జపేశం.

సంగీత సుధాస్రవంతిలా సాగుతూ ప్రేక్షకుల హృదయాలను రంజింపజేస్తూ ఏవేవో తెలియని సంగీత లోకాలకు తీసుకుపోయే నూతన సినీ ఆర్ట్స్ "త్యాగయ్య" వర్ణ కావ్యం ఏప్రిల్ 9న విడుదలవుతుందని నిర్మాత ఎన్. కృష్ణంరాజు తెలియజేశారు. ముళ్ళపూడి వెంకటరమణ స్క్రీన్‌ప్లే, సంభాషణలతో బాపు దర్శకత్వం నెఱపారు.



'జేగంటలు'లో ప్రభాకరరెడ్డి, అరుణ

## కె. రాఘవేంద్రరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ రెండు చిత్రాలు

"మార్చిలో ఒకటి, ఆగస్టులో ఒకటి — రెండు చిత్రాలు మొదలెడుతున్నాం," అన్నారు టి. త్రివిక్రమరావు. మొదటి చిత్రంలో కృష్ణంరాజు, జయప్రద, సుజాత, రావు గోపాలరావు ఆదిగాగల వారుంటారు. గుహనాథన్ కథకుడు. రెండవ చిత్రంలో ఎన్. టి. ఆర్., శ్రీదేవి నాయకా నాయికలు. రెండు చిత్రాలకూ సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ తెరవెనుక హంగులని నిర్వహణ బాధ్యతలు వహించే టి. ప్రద్యుమ్నరావు తెలిపారు.

## "మరో కురుక్షేత్రం"

"మే 1న రాజమండ్రి ప్రాంతాల్లో షూటింగ్ మొదలెడుతున్నాం. జూన్‌కు ముగుస్తుంది," అన్నారు భరద్వాజ. ఈయన నిర్వహణలో దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు రాసి, పర్యవేక్షణ జరిపే శ్రీ చరిత చిత్ర వారి పై చిత్రానికి రేలంగి నరసింహారావు దర్శకుడు. మోహన్‌బాబు, రంగనాథ్, శారద ముఖ్య భూమికలు నిర్వహిస్తారు.

జి. వి. జి.

## ఇల్లాలు

భర్తకు ప్రేమమూర్తి!
బిడ్డకు మాతృమూర్తి!!
సృష్టికే దేవతామూర్తి!!!





చూడండి!



ఎ. పూర్ణచంద్ర రావు
సమర్పించు



బాబు ఆర్ట్స్

# ఇల్లాలు

కలర్

దర్శకత్వం
తాతినేని రామారావు

నిర్మాత
జి. బాబు BSc,



లక్ష్మీచిత్ర శ్రీలక్ష్మీచిత్ర

SREE PUBS.



'అన్నపూర్ణా ప్రొడక్షన్స్ నెం. 4'లో శ్రీ...

## మూడు "ఉగాదు"లు

"నేను ప్రతి ఏడూ మూడు ఉగాది పండుగలు జరుపుకుంటూంటాను," అంది జయమాలిని. "ఒకటి – జనవరి ఫస్ట్. అది యూనివర్శల్. రెండు – ఆంధ్రుల పెద్ద పండుగ 'ఉగాది'. మూడు తమిళవత్సరాది... నేను తమిళనాడుకు చెందినదాన్నయినా – నన్నధికంగా ఆదరించే ప్రేక్షకులు తెలుగునాట ఉన్నందువల్ల తెలుగు వత్సరాదిని మాత్రం చాలా ఘనంగా జరుపుకుంటూంటాను," అంటుందామె. వీరి కులదైవం తంజావూరు లోని శ్యామలాదేవి. "ఆ దేవి విగ్రహానికి సువర్ణ మంగళసూత్రం చేయించిన వెంటనే మా అక్కయ్యకు వైభవోపేతంగా వివాహ మహోత్సవం జరిగింది," అనే ఈమెకు నచ్చిన చిత్రం "మదనమంజరి" అట. "ఆ చిత్రంలో నేను కాస్సేపు వృద్ధనారిలా కనిపించినా – ఆ వేషం నాకెంతో సంతృప్తి నిచ్చింది. అసలు విఠలాచారిగారు నాకా కథ వినిపించినప్పుడే – నా నటనా కౌశల్యాన్ని ప్రదర్శించడానికి అవకాశం దొరికింది కదా – అని ఎంతగా మురిసిపోయానో! ఎప్పుడూ కెమెరా ముందు నృత్యం చేసే నేను – అప్పుడప్పుడు ఇలా నటించే అవకాశాలు కలిసి రావడంకన్నా మించిన తృప్తి నాలోని ఆర్టిస్ట్‌కు ఇంకేం ఉంటుంది ? అసలు తొలుత నేను నటిగానే కెమెరా ముందు నిలుచున్నాను. ఆ తర్వాతే నర్తకినయ్యాను," అందామె.

## సినిమా

### రిజిష్టరైన చిత్రాల పేర్లు

ఎ. వి. ఎం. మురుగన్ అండ్ కో "మన ఊరి కృష్ణ", ఆదిశక్తి చిత్ర "చూడ చక్కని వాడు", శ్రీ భీమేశ్వర కంబైన్స్ "శివభక్తుడు" శ్రీ రత్నా ఇంటర్నేషనల్ "హనీ మూన్" డి. వి. కె. ఫిలిమ్స్ "బ్రిహిలెం మొండోడు" గోగినేని చిత్ర "కాలజ్ఞాని", ఆర్.ఆర్. ప్రొడక్షన్స్ "రాము – సోము", శివశక్తి ఫిలిమ్స్ "టిక్ టిక్ టిక్", జగన్మాతా ఆర్ట్స్ "కలియుగ దైవం", డి. వి. కె. ఫిలిమ్స్ "నందమూరి బండోడు". ఆర్. ఆర్. ప్రొడక్షన్స్ "సుశీల", కృష్ణప్రసాద్ మూవీ క్రియేషన్స్ "కరుణాసాగరం", నాగార్జున పిక్చర్స్ "పక్కింటి అమ్మాయి", మధు క్రియేషన్స్ "రాజ న ర్త కి", బి. ఆర్. ప్రొడక్షన్స్ "అల్లుళ్ళొస్తున్నారు జాగ్రత్త", విజయకళామందిర్ "అపరంజి బొమ్మ", అనిల్ ప్రొడక్షన్స్ "టెంగు రంగడు", జననీ సినీ ప్రొడక్షన్స్ "శ్రీ కాళీక్షేత్ర మహాత్మ్యం", స్వాతి చిత్ర కంబైన్స్ "తమాషాలో తధికిణతోం", కృషీచిత్రాలయ "జై జై ఇందిరమ్మ", యునైటెడ్ ఆర్ట్ మూవీస్ "సింహాచలం – భద్రాచలం", పూర్ణోదయా మూవీ క్రియేషన్స్ "సీతాకోకచిలుక", వివేకా ఫైన్ ఆర్ట్స్ "జీవిత రథం", అమృతా ఫిలిమ్స్ "ఊరికిచ్చిన మాట".



'జీవిత రథం' ఒక దృశ్యం

దేవి ఫిలిం ప్రొడక్షన్స్

# తిరుగులేని మనిషి

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత
కె. దేవివరప్రసాద్ B.E.,

దర్శకత్వం
కె. రాఘవేంద్రరావు B.A.,

నిర్వహణ: లీలాప్రసాద్ (బాబ్జి)

సంగీతం: కె.వి. మహదేవన్

కెమెరా: కె.యస్. ప్రకాష్



## డిపీ-నే డిపీ-తో డిపీ-రుచీ
## రుచీ-డిపీస్ స్క్వాష్‌లు
## మరెంతో మజా మజా

మనసు దోచుకునే, నోరూరించే పళ్ళు. చక్కగా బాగా పండిన పళ్ళు. తియ్యని ఊటలూరే రసం. "అవునండి, రసమయం, మీ దాహం తీర్చే పానీయం, సమయం సమయం". డిపీ ది కిడ్‌కి తెలుసు సుమండీ దాహం తీర్చే యీ కిటుకు!

డిపీస్ యొక్క చకితుల్ని చేసే ఆకర్షణ, చూపుల్ని ఆకట్టుకునే ఆ లేబుల్ గల లెమన్, ఆరేంజ్, మేంగో స్క్వాష్‌లు, లెమన్ బార్లీ వాటర్, లైమ్ కార్డియల్, పైనాపిల్ క్రష్, రుచిగల షర్‌బత్ సిరప్‌లు.

**రసంగా మారిన పళ్ళు మీ కోసం డిపీస్ రూపంలో తాగండి మీకే.**






## డిపీస్ అసలైన పళ్ళ రుచిగలది.

daCunha-Dip-84 TL



'మరియా మై డార్లింగ్'లో శ్రీప్రియ

## సినిమా

### ప్రేమజ్యోతి

"మార్చి 15 నుంచి ఏప్రిల్ 12 వరకు విశాఖ, భీమిలి, అరకులోయ ప్రాంతాలలో ఏకబిగిన షూటింగ్ జరుగుతుంది." అన్నారు భీమేశ్వరరావు ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో సి హెచ్ సుబ్బారావు, యోగి నిర్మించే శ్రీ శ్రీనివాస క్రియేషన్స్ "ప్రేమజ్యోతి"లో శ్రీధర్, జ్యోతి, సువర్ణ, సత్యేంద్రకుమార్ ఆదిగా గలవారున్నారు యడవల్లి సంభాషణలకర్త జి కె వెంకటేష్ సంగీత దర్శకుడు పి. లక్ష్మణరావు ఛాయా గ్రాహకుడు.

### ఇల్లే స్వర్గంలో ఆఫీసులో హనుమంతు !

టక్ చేసి, టై కట్టుకొని ఉన్న హనుమంతు (అల్లు రామలింగయ్య) ఠీవిగా లేచి ముస్తాబు సరిచేసుకుంటూండగానే రజని అటు రాసాగింది "అమ్మాయ్, ఇక్కడ సంతకం చేయాలి," అన్నారు హనుమంతు ఏదో ఫైల్ చూపిస్తూ. రజని (మాధవి) లెక్క చేయకుండా తన ఆఫీసు గదిలోకి వెళ్ళిపోయేసరికి హనుమంతుకు తల తీసేసినంత పనైంది. దానికి తగ్గట్టు ఫిమేల్ పర్సనల్ అసిస్టెంట్ నవ్వి, "పంచెకట్టు విప్పేసి పాంటెక్కినా ....పెద్దబాటమ్ వేసింది ఎవరికోసమో !" అని హసరాగం తీయడంతో హనుమంతుకు అరికాలిమంట నెత్తికెక్కింది "నీకోసం కాదు," అంటూ చిరాగ్గా ఫైల్‌ను చంకన బెట్టి, రజని గదిలోకి వెళ్ళాడు "గుడ్ మార్నింగ్, మిస్ రజనీ!" అన్నాడు మృదువుగా రజని ఎగాదిగా చూసింది హనుమంతు పక్కున నవ్వి, వెంటనే నవ్వు ఆపి, కోతిలా మూతి ముడుచుకొని, "బీ యె రోమన్ ఇన్ రోమ్ — అన్నారు... అందుకని — ఇలా ఇంటిదగ్గర పంచె, ఆఫీసుకొస్తే పాంటు... హిహిహి... పాంటులో ఎలా ఉన్నాను ?" కనుబొమలు ఎగరేశాడు.

"మీ పేరేమిటన్నారు ?" అడిగింది రజని. హనుమంతు తెలియపరచగానే "కరెక్ట్ ! హనుమంతుడికి పాంటు తొడిగితే ఎలా ఉంటుందో అలా ఉంది. తోక కత్తిరించి, రోమ్‌కి పార్శిల్ చెయ్యొచ్చు," అంది.

హనుమంతు గుడ్లు మిటకరిస్తూ ఫైల్ చూపించి, "సంతకం పెట్టండి," అన్నాడు హీనస్వరంలో.

గార సత్యనారాయణమూర్తి, బి. ఎ. (లిట్) దర్శకత్వం వెలపిన నటరాజ్ ఆర్ట్ క్రియేషన్స్ "ఇల్లే స్వర్గం" చిత్రాన్ని డాక్టర్ దీకటి ఆంజనేయులు, దాసరి గోపాలకృష్ణ, శంభంగి అప్పారావు నిర్మించారు

### మినిస్టర్ మీనాక్షి

"గుడివాడ దగ్గర నందవాడలో ఏప్రిల్ 10 నుంచి ఒకే షెడ్యూల్‌లో పూర్తవుతుంది," అన్నారు డాక్టర్ రంగారావు ఈయన తొలిసారిగా దర్శకత్వం నెరపే మిత్రా ప్రొడక్షన్స్‌వారి పై చిత్రానికి జి బాపయ్య చౌదరి, డాక్టర్ పద్మనాభం నిర్మాతలు శ్రీధర్, మూతన్ ప్రసాద్, ప్రసాద్‌బాబు, పద్మనాభం, నరసింహరాజు, చిట్టిబాబు, మాడా, సత్తిబాబు, జయంతి, కృష్ణవేణి, శ్రీగీత, ఇందిర, సుశీల పాల్గొంటారు రాజాశివానంద్ రచన, మాధవరావు సంగీతం, పి లక్ష్మణ్ ఛాయ, సాయికుమార్ శిల్పంతో మూడవనేని భావనారాయణ ప్రొడక్షన్ కంట్రోలర్

## కార్టూనిస్టులకు సూచనలు !

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు స్పష్టంగా సాధ్యమై నంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవ టానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !
- ★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివి నప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్‌మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరు గల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది — దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది — పరిశీలనకి ఐదారు వారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు—బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం —
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితం మీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి

సం॥

## సినిమా

'జయసుధ'లో ఒక సన్నివేశం

### వాడవిమల్లిలో సోములమ్మ సవాల్

బంగారురాజు మనుష్యులు పాకల్లోని వస్తువు లంతా బయట పారేస్తూంటే, మూకరాజు ఆగ్రహంతో అడ్డం వెళ్ళాడు.

''ఈ గుడిసెలు ఖాళీ చెయ్యాల్సిందే! ఇది నా ఆస్తి. ఇందులో మీకెవ్వరికీ అధికారం లేదు,'' బంగారురాజు గర్జించాడు.

''అధికారం మీ డబ్బుది. ఎదురుతిరిగే ధైర్యం మా దరిద్రానిది,'' అన్నాడు మూకరాజు.

''వీళ్ళలో విప్లవం తెస్తున్నావా ?''

''కాదు; బ్రతుక్కి మార్గం చూపిస్తున్నాను''

బంగారురాజు సైగ చేయగానే ఇద్దరు మనుషులు మూకరాజుతో కలబడ్డారు ఇంతలో సోములమ్మ ''ఒరేయ్, ఆపండిరా ఆపండి!'' అంటూ పరుగున వచ్చి, ''ఏం, బంగారంబాబూ, నీ బలం యీళ్ళమీద చూపుతున్నావ్! యీడ నిన్ను చంపిన దిక్కులేదు. కూటికి గతిలేని వాళ్ళ మీద నా నీ జులుం ?'' అంది.

''ఈ స్థలాలు నావి,'' అన్నాడు బంగారురాజు.

''నీ బాబు ఎట్లా గడించాడో నాకు తెలీదను కోకు. యీ డబ్బు, హోదా, ఆ మోటారు సైకిలు నీవి కాదురా. పేదోళ్ళ ఉసురు. ఆ ఉసురే నిన్ను తాడై చుట్టుకుంటుందిరా!''

''నన్ను చంపినా సరే - కాదంటే కోర్టుకు వెళ్తాను. పోలీసుల్ని పిలుస్తాను పోలీసు పోలీసు.''

''ఛా! ఆడంగి మాటలు చెప్పకు దమ్ముంటే చెటలెత్తుంటు చెయ్యి.''

'కళ్యాణయోగం'లో రాజాశ్రీధర్, సుభాషిణి



''ఇన్ని నీతులు చెప్పేదానివి నీవే కొని వీరం కెందుకు దానం చేయకూడదూ ?''

''చెడ్డోడివైనా మంచి మాట చెప్పావురా! రేటు చెప్పు, డబ్బు ఋసిరిపారేస్తాను. రేపే రిజిస్ట్రేషన్.''

''ఆ!'' బంగారురాజు ముఖంలో కత్తివాటుకి నెత్తురుచుక్క లేకపోయింది. ఇంకో క్షణం అక్కడుండలేక తన అనుచరులతో జారుకున్నాడు

విమలాదేవి స్క్రీన్‌ప్లే రాసి సమర్పించే ''వాడని మల్లి'' చిత్రానికి బహుమతి పొందిన 'చీకటోళ్ళు'' నవల ఆధారం ఎ. వి. ఎం. సుప్రియ, కళారాణి, చౌదరీబాబు, నందకుమార్, టెలిఫోన్ సత్యనారాయణ, రాఘవయ్య, దినకర్, తులసీదేవి, మారంపల్లి శ్రీలక్ష్మి, శ్రీహరి, సి.హెచ్. అన్నపూర్ణ పాల్గొన్నారు. సత్యం సంగీతం, తివారీ ఛాయ, కె. ఆర్. రామలింగం కూర్పు, టి. ఎస్. రామారావు సహకార దర్శకత్వం నిర్వహించారు. మురికివాడల బేక్‌డ్రాప్‌లో విశిష్టంగా సాగే ఈ చిత్రానికి దర్శకత్వం వహిస్తూ నిర్మించిన ఎ. వి. ఎం. మురుగన్ లోగడ ''పూజ'', హిందీలో ''జైసేకో తైసా (బుల్లెమ్మ బుల్లోడు, జీవనజ్యోతి, ముత్యాలముగ్గు) చిత్రాలకు ప్రతిభావంతంగా దర్శకత్వం నెఱపారు.



'త్యాగయ్య'లో సోమయాజులు, కె. ఆర్. విజయ

## సి ని మా

### సు ధా క ర్

చాలా కాలం తర్వాత సుధాకర్‌కు తెలుగు చిత్రాలలో అవకాశాలు వచ్చాయి. "అగ్నిపూలు, పేదల బ్రతుకులు, భోగిమంటలు, కలియుగ రాముడు, ప్రేమ నక్షత్రం, ఊరికిచ్చిన మాట (అమృతా ఫిలింస్)" చిత్రాల్లో నటించే ఈ స్ఫురద్రూపి తెలుగులో కొన్ని కథలు, గేయాలు రాశాడు. "కిళక్కుం పోగుం రైల్" (తూర్పు వెళ్లే రైలు) తమిళ చిత్రం ద్వారా సినిమా రంగ ప్రవేశం చేసిన ఇతను ఆ చిత్రంలో తొడుక్కున్న ఓ షర్ట్‌ను ఆ తర్వాత నటించే ప్రతి చిత్రంలోనూ ఏదో ఒక సీన్‌లో ధరిస్తున్నాడట. ఇతను మద్రాసులో సాయంత్రం ఆరు గంటల ప్రాంతంలో ఇంటివద్ద ఉంటే, టెలిఫోన్ దగ్గరే కూర్చుండిపోతాడట. కాస్సేపటికి టెలిఫోన్ బెల్ మోగుతుంది... రిసీవర్‌ను చెవిదగ్గర ఉంచుకుంటే, ఒక కమ్మని గానం వినిపిస్తుందట. థాంక్స్ చెప్పాక డిస్కనెక్ట్ అయిపోతుందట. కాని, "ఇంతవరకు ఆ అమ్మాయిని చూడలేదు. ఆమె ఎవరో అసలే తెలీదు," అంటాడు సుధాకర్. "నేను ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో శిక్షణ పొందేటప్పుడు 'దీపం' తమిళ చిత్రంలో సుజాతను, విజయకుమార్ ఎత్తుకునే సన్నివేశం చూసినప్పట్నుంచి నాకు అలాటి అవకాశం ఎప్పుడొస్తుందా అని ఎదురుచూడసాగాను. ఒకసారికాదు; రెండుసార్లు అలాటి అవకాశం వచ్చింది. అమ్మబాబోయ్! 'మలరుమ్ విన్నై వుగళ్' పిక్చర్‌లో సుమతిని, ఇంకో తమిళ చిత్రంలో దీపను మోయడానికి అపసోపాలు పడిపోయాను. ఇలాంటి శిక్ష మళ్ళీ ఇక వద్దనిపించింది," అన్నాడు సుధాకర్ నవ్వుతూ. 

'దీపారాధన'లో శోభన్, జయప్రద






## "ధర్మాజీ ! సలాం"

"ఖాసిం — నమస్తే — రా — కూర్చో ఏమిటి సంగతి — ఆరోగ్యం బాగుందా ?"

"నా ఆరోగ్యానికేమిలే, బాగానే వుంది — గాని నా బేటా అక్బరుకే బాగులేదు."

"ఏం, ఏమైంది ? మొన్న నవ్వుతూ స్కూలుకు వెళ్తుంటే చూసేనే !"

"నిన్న రాత్రినుంచి కాస్త జ్వరంగా ఉంది, ధర్మాజీ ! నాకు ఆందోళనగా వుంది. ఒక్కసారి వచ్చి చూసిపోదూ."

ధర్మాజీ ఆసుపత్రి వసారా అంతా పరికించేడు. పాతిక వరకు రోగులు వేచున్నారు ప్రొద్దుటినుంచి. ఇంకా వాళ్ళని ఉండమనడం సబబు కాదు.

"ఖాసిం, నేను ఒక గంటలో వీళ్ళని పంపించేసి వస్తాను — పాపం ! ప్రొద్దున్నుంచి కూర్చున్నారు."

"సరే భాయ్, త్వరగా రా... నేను వెళ్ళి పిల్లాడి దగ్గరుంటాను. కారును నేను వెళ్ళేక పంపిస్తాను."

ధర్మాజీ నవ్వుతూ, ఖాసిం భుజంమీద ఆప్యాయంగా చేయివేసి — "వద్దులే, నా కారులోనే వస్తా. నువ్వు అక్బరు గురించి గాభరా పడకు. సీజను మారింది, అందువల్ల కాస్త జ్వరం వచ్చుంటుంది. రేపీ సాయంత్రం సరికి, అక్బరు నవ్వుతూ నన్ను పలకరించేట్టు చేస్తాగా — నువ్వు వెళ్ళు."

అలా ధైర్యం చెప్పిన తరువాత ఖాసిం ముఖం విప్పారింది. అంతవరకు మేఘావృత గగనంలా ఉండేది. ధర్మాజీని త్వరగా రమ్మని చెప్పేసి ఖాసిం వెళ్ళిపోయేడు.

"డాక్టరుగారు ! నమస్కారం."

"ఏమయ్యా వెంకన్న ! మీ అమ్మ కిప్పుడెలా గుంది ?"

"జ్వరం తగ్గలేదండి — గాని మునుపున్న వాపులు తగ్గేయండి. మీరోసారి వచ్చి చూడాలి."

"సరే మధ్యాహ్నం వస్తాలే — ఏదీ నీ చెయ్యి ఎలాగుంది ?"

"బాధ తగ్గింది. కాని చెయ్యి కదపనివ్వడం లేదండి."

"అవునయ్యా -- అంతమేర కాలిందికదా, అంత త్వరగా నయమవుతుందా ? లోపలికి వెళ్ళు. కంపౌండరు ఆ కట్టు మారుస్తాడు."

"సలాం — ధర్మాజీ."

"అబ్దుల్లా — ఏం మళ్ళీ వచ్చేవు ?"

"మరేంలేదు — నా కన్ను..."

"నీ కన్నుకేం క్షేమంగ్గా ఉంది — అంతగా అయితే కనుపించడంలేదు — అంతేగా ?"

"అంతేనండి — మరి ఏదైనా మందు."

"చూడు అబ్దుల్లా — నేను చాల బిజీగా ఉన్నాను. నా కాలం వ్యర్థం చేస్తే నీకేం వస్తుంది? నీకు మొదటే చెప్పేను. మందులేవి పనిచెయ్యవు — ఆపరేషను చేస్తానని. నువ్వు వట్టి పిరికివాడివి. నీకు ధైర్యం కలిగేకే నా దగ్గరకు రా... ఆపరేషను చేస్తాను. చూపు మళ్ళీ కలుగుతుంది. అంతవరకు నా దగ్గరకు రాకు. పిరికివాళ్ళంటే నాకు కోపం."

"మరేం లేదండి - నాకిప్పుడు భయంలేదు గానీండి..."

"గాని — ఏమైంది అబ్దుల్లా ?"

"నా దగ్గర ఇప్పుడంత డబ్బు లేదండి."

ఆ మాటకు ధర్మాజీ రెచ్చిపోయేడు.

"ఏమయ్యా ! నీకు బుద్ధుందా — లేదా ? ఎంత డబ్బు నేను అడిగేను? ఇంతకీ డబ్బు ప్రస్తావనే వచ్చిందా ? నీకు చూపు కావాలన్నావు — నేను ఆపరేషను చేస్తానన్నాను. నీకు కలిగితే నీకు తోచినంతిస్తావు, లేకపోతే మానుకుంటావు; అంతే కాని నేను అడగని డబ్బును నువ్వు ఇవ్వవలసి వస్తుందని భయపడి కన్ను పోగొట్టుకుంటావా ? ఛా ఛా."

"క్షమించండి — ధర్మాజీ ! తెలియక ఏదో అనేసేను. రేపే వస్తానండి ఆపరేషనుకు."

"సరే, నీ ఇష్టం."

ధర్మాజీ ధర్మ కోపానికి హాలులో ఉన్న పేషంట్లు నవ్వుకున్నారు.

అబ్దుల్లా సలాం చెప్పేసి త్వరగా వెళ్ళిపోయేడు.

* * *

ధర్మాజీ అసలుపేరు కొప్పిలి ధర్మారావు. వాళ్ళ స్వగ్రామం ఆంధ్రాలోని చీరాల. వాళ్ళది పట్టు శాలీల వంశము. ధర్మారావు మేనమామకి చీరాలలో బట్టల వ్యాపారముంది. తన చిన్నతనంలో తన తండ్రి మరి కొంతమంది పట్టుశాలీలతో కలిసి మహారాష్ట్రలోని బివండీ అన్నఊరుకి వలస వచ్చేసేడు. బివండీలో సుమారు పది పదిహేనువేల మంది ఆంధ్రులున్నారు. చాలా మట్టుకు నూలు వడకడం, బట్టలు నేయడం వంటి టెక్స్టైలు పరిశ్రమలలోనే వాళ్ళంతా పనిచేస్తున్నారు. ప్రసిద్ధి కెక్కిన ఆంధ్రుల పట్టుశాలీల నేర్పు, కౌశల్యం ఈ పరిశ్రమలలో ఉపయోగపడుతున్నాయి. అందుకే అక్కడున్న మహారాష్ట్రులకు ఈ ఆంధ్ర పారిశ్రామికులంటే మంచి గౌరవం. మరి కొంతమంది ఆంధ్రులు అక్కడ వివిధ వ్యాపారములు చేస్తున్నారు. ధర్మారావు తన మేనమామ దగ్గర పెరిగి పెద్దవాడై ఆంధ్రాలోనే డాక్టరు పట్టా ఓ చేత్తో పుచ్చుకుని, మరో చేత్తో మేనమామ కూతుర్ని చేపట్టి, తన తల్లిదండ్రులున్న బివండీ వచ్చేసేడు, పాతికేళ్ళ క్రితం.

డాండ్రఫ్ (చుండు)ను తొలగిస్తుంది. జుట్టును ఆరోగ్యంగా ఉంచుతుంది

క్లినిక్ షాంపూ

# కాని మీరు వదిలించుకోవాల్సింది ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండు అయితే మీకు కావాల్సిన షాంపూ, క్లినిక్‌ని మించినదై ఉండాలి మరి







# క్లినిక్ స్పెషల్

క్లినిక్ మీ చుండుపై పనిచేసిందని, మీకు సరిగ్గా సరిపడిందని మాకు తెలుసు. అయితే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండుగల వారున్నారన్న సంగతీ మాకు తెలుసు.

అందుకే ఓ పటాన లొంగని, తీవ్రమైన చుండును తొలగించేందుకు కొత్త సూత్రీకరణను ప్రవేశపెట్టాం. క్లినిక్‌ని మించినదది...దాని పేరు క్లినిక్ స్పెషల్. ఆ! ఇప్పుడు రెండు క్లినిక్ షాంపూలు ఉన్నాయి. మామూలు చుండుకు క్లినిక్...ఓ పటాన లొంగని తీవ్రమైన చుండుకు క్లినిక్ స్పెషల్ ఇక ఈ రెండింటి కలయిక చుండు సమస్యలన్నింటికీ నివారణే మరి.

హిందుస్తాన్ లివర్ లిమిటెడ్ వారి విశిష్ట ఉత్పాదన.

HLSC-5041

సున్నితమైన మీచర్మ
సౌందర్యానికి
చంద్రిక ఆయుర్వేద సబ్బు

చర్మంపై దద్దులు, మొటిమలు, బ్లాక్ హెడ్స్, తలమండు మొదలైన వాటికి ఎంతో మేలైనది. ఎందుకంటే, యిది కొన్ని మూలికలనుంచి, శక్ తైలాలనుంచి మీ చర్మాన్ని పోషించేందుకు తయారు చేయబడినది.

ప్రకృతి సహజమైన వనరులనుంచి తయారైన సబ్బుకన్న మేలైన సబ్బుమరొకటి ఉందా ?




# చంద్రిక
## ఆయుర్వేద సబ్బు

సహజమైన మార్గమే
ఉత్తమమైన మార్గము

Shruti/CAS/811T

Sole Distributors for Andhra Pradesh : **Chandrika Enterprises,**
6-2-39/A, A.C. Guards, Hyderabad 500 004.













# బాపు కార్టూన్స్

నవ్విన నాపచేను

అనగనగనగా ఓ ముసలి సుబ్బయ్య పోతూ పోతూ కొడుకు రామయ్యకు నాపచేను యిచ్చేడు. యిచ్చి 'నవ్విన నాపచేను పండదా' అని జనాంతికంగా అని మరీ కన్నుమూసాడు. తండ్రిమాటలకు విలువయిచ్చి రామయ్య తన నాపచేనుని చూసి అదే పనిగా నవ్వేడు. కితకితలుపెట్టి నవ్వించేడు. అయినా నాపచేను పండ లేదు. దాంతో బాధపడి పోతున్న రామయ్యని చూసి అతని భార్య స్వాతిలక్ష్మి మనస్ఫూర్తిగా నవ్వితేగాని నాపచేను పండదంది. మనస్ఫూర్తిగా నవ్వాలంటే ఏంచెయ్యాలన్నాడు రామయ్య. స్వాతిమాలక్ష్మి రామయ్యకి స్వాతి ప్రచురణలలో వచ్చిన "బాపు కార్టూన్స్" పుస్తకం రామయ్యకు యిచ్చింది. రామయ్య ఆ పుస్తకం తీసుకుని నాపచేను దగ్గర కూచుని చదవటం మొదలెట్టాడు. అతడు కార్టూన్లు చూసి కడుపుబ్బ నవ్వేడు. ఆ నవ్వులకు నాపచేను, అది పుట్టి కొత్త అన్నది కూడా పట్టించుకోకుండా విరగ పండేసింది! అంచేత నాపచేనుని సైతం పండించే నవ్వులు పుట్టించే "బాపు కార్టూన్స్" ని కొనటం ఎంతో మంచిది కదా!

ఆనందానికి హరివిల్లు అలసిన హృదయాలపై తొలకరి జల్లు "బాపు కార్టూన్స్" తెచ్చుకొని చదవండి!

స్వాతి అన్ని ప్రముఖ పుస్తకాల షాపులలోను దొరుకుతుంది.
120 పేజీల్లో సుమారు 200 కార్టూన్లతో నిండిన "బాపు కార్టూన్స్" విడి ప్రతి వెల ఆరు రూపాయలు మాత్రమే!

## స్వాతి పబ్లికేషన్స్

పి. బి. నెం. 339 : : సూర్యారావుపేట : : విజయవాడ-520 002.

బివండీలో ఉన్న జనాభాలో ముసల్మాన్లు, హిందువులు సరిసమంగా ఉన్నారు. హిందువులలో సగ భాగం ఆంధ్రులున్నారు. ఆంధ్ర సంస్కృతికి, సంఘానికి గౌరవాధ్యక్షుడు, డాక్టరు ధర్మారావు. ధర్మారావు ఈ పాతికేళ్ళ ప్రాక్టీసులో చాలా పేరు ప్రతిష్ఠలతో, ధనం ఆర్జించేడు. బివండీలోనేగాక ఈ చుట్టుప్రక్కల ఉన్న గ్రామాలలో కూడా మంచి డాక్టరని, చల్లని చేయని పేరు తెచ్చుకున్నాడు. ధర్మారావు పేరు, మెల్లగా ధర్మారావుజీ, అది క్రమేణా ధర్మాజీగా మారిపోయింది. ఆఖరుకి ఆ పేరే స్థిరమైపోయింది.

ధర్మాజీ ఎప్పుడూ నోరు తెరిచి ఏ పేషంటుని డబ్బు అడగడు. వాళ్ళెంత యిస్తే అంత పుచ్చుకుంటాడు. ఇవ్వకపోయినా ఏమి అనుకోడు. ఇంకా బీదవాళ్ళయితే తన డబ్బుపెట్టి మందులు కొని ఇస్తాడు. వివిధ మందుల కంపెనీల నుంచి వాళ్ళ ఏజెంట్ల వల్ల చాలా మందులు డాక్టర్లకు వస్తుంటాయి. చాలామంది డాక్టర్లు చేసినట్లు ఆ మందులు అమ్మకోడు. బీద రోగులకు ఇచ్చేస్తాడు. అందుకే అతడు పేరుకి తగినట్లు ధర్మప్రభువని అందరూ గౌరవిస్తారు. ఇప్పుడు ధర్మారావుకి యాభై ఏండ్ల మహాలక్ష్మివంటి భార్య, ఇద్దరు కొడుకులు, ఇద్దరు కూతుళ్లు అతని సంసారం. అన్ని విధాల సంతృప్తి కలిగివున్న ధర్మాజీకి ఈమధ్య చిన్న అశాంతి కలుగుతూంది. ముసల్మానులు, హిందువులు ఆ బివండీలో తరాలవారిగా ఎంతో సఖ్యతతో జీవిస్తున్నారు. దేశంలో ఏ మూలో మత కలహాలు కలిగినప్పటికి వాళ్ళేమి చలించకుండా చాలా బాంధవ్యంతో కలిసిమెలిసి బ్రతుకుతున్నారు. కాని గత నెల్లాళ్ళుగా ఈ పారిశ్రామిక నాయకులు రెండు మతాలకీ యిద్దరు తయారై చిన్న చిన్న కలహాలు కల్గిస్తున్నారు.

ఆ ఊరులో చాలామందికి ధర్మాజీ అంటే చాలా గౌరవం. అలా అని ధర్మాజీ అంటే యిష్టం లేనివాళ్ళు లేకపోలేదు. అలాగే ఖాసిం అలీ అంటే ముసల్మానులకు చాలా భక్తి, అభిమానం. అతడు వాళ్ళకి మౌల్వికూడా. ఖాసింకు పరువు, ప్రతిష్ఠ, అర్థికబలం చాలా ఉంది. కానీ చాలా కాలం వరకు పిల్లలు కలుగలేదు. అదే అతనికి చింతగా ఉండేది. కానీ అతడు ఏకపత్నీవ్రతుడు. అతడు ముసల్మాను అయినప్పటికి బహు భార్యత్వంమీద ఆయనకు గౌరవం లేదు. అలా నమ్మకంతో ఉన్న ఖాసింకు 'అల్లా' అన్యాయం చేయలేదు. ఖాసింకు వివాహమైన ఇరవై సంవత్సరములకు చందమామ లాంటి చక్కని కొడుకు పుట్టేడు. ఆ కొడుక్కి అక్బర్ అలీ అని పేరు పెట్టుకున్నాడు. ఖాసింకు అక్బర్ పాదుషా అంటే ఎంతో పూజ్య భావం. అన్ని మతాలని సమదృష్టితో చూచిన అక్బరు పాదుషా సిసలైన ముసల్మానుగనీ, పర మతాలను సంకుచిత దృష్టితో చూచిన ఔరంగజేబు, ఎన్ని ప్రార్థనలు సల్పినా, తన టోపీలను తనే కుట్టుకున్నా, అసలైన ముసల్మాను కాడని అతని నమ్మకం. అందుకే ఏ మతం వాడైనా, మానవత్వం కల్గినవాడైతే తన సోదరుడితో సమానమని అతడు భావించేవాడు.

మౌల్వి ఖాసింకు డాక్టరు ధర్మాజీతో పదిహేను

# ఊరు చచ్చిపోయింది

ఏళ్ళ క్రితం పరిచయం అయింది. ఆనాటినుండి ఈనాటివరకు ఆ స్నేహం దిన దిన వృద్ధి పొంది, రక్తాన్ని పంచుకున్న యిద్దరు సోదరుల కున్నంత బాంధవ్యంగా మారింది. వాళ్ళ స్నేహాన్ని చూసి అసూయ చెందినవాళ్ళు లేకపోలేదు. ధర్మాజీకి ఖాసిం కొడుకు అక్బర్ అంటే చాలా ప్రేమ. తన పిల్లలు పెద్దవాళ్ళయిపోయేరు. అందుకే చిన్నపిల్లవాడైన ఆ అక్బర్‌తో ఆడుకుండేవాడు. ఎన్నో బొమ్మలు, పండ్లు, బిస్కట్లు కొని యిచ్చేవాడు. డాక్టరు ధర్మాజీ రాగానే ఖాసిం ఇంట్లోవాళ్ళు 'అదుగో మీ బాబాయ్ వచ్చేరు', అని చెప్పేవారు. అక్బరు

## ఉగాది పాట

ఉగాది వచ్చింది చెలీ!
ఒక్క పాటపాడు
ఉజ్వలమైన శోభలు
ఉర్వి నిండినవి చూడు

శిశిర తాపానికి గురైన
చెట్లవైపు చూడు
కిసలయోత్కరాలతో
హసిస్తున్నవి నేడు

నిన్నటి శిశిర తాపాన్ని మరచి
నేడు చిరునవ్వే వనాల్లా
మానవాళి కంటకాల్ని గడచి
మధుమాసంలో ప్రవేశించాలి

మాలిన్యాలు శిశిర పత్రాల్లా
రాలిపోయినవి నిన్న
అవనికి ఆనందం పంచగా
ఆగమించింది వసంతం నేడు

ఏదీ ఉగాది పచ్చడి పాత్ర
ఈ పెదవికందించు చెలీ!
ఒగరు తీపి చేదుల్లోనే
ఉంది జీవిత మాధుర్యం సఖీ!

ఉగాది వచ్చింది చెలీ!
ఒక్క పాటపాడు!

— తిరునగరి

కూడా 'బాబాయ్' అని చనువుగా మెసలేవాడు. అలా ఉండేది వాళ్ళ బాంధవ్యం. ఈ కథనాటికి అక్బర్ ఏడేండ్లవాడు. మరి తల్లిదండ్రులకు రెండో ప్రాణంగా ఉండేవాడు.

* * *

ధర్మాజీ ఆ సాయంత్రము ఆంధ్రా క్లబ్బులో కూర్చున్నాడు. ప్రక్కన మరో కుర్చీలో గోపాలరావు కూర్చున్నాడు. గోపాలరావు కార్మికుడు. కార్మికులలో మంచి పలుకుబడి ఉన్నవాడు.

''చూసేరా! ధర్మాజీ! మరో పదిహేను రోజులలో శివాజీ జయంతోత్సవాలు జరపాలను కుంటున్నారు మహారాష్ట్రులు. కానీ ఈ ఊరిలో మాత్రము ఆ ఉత్సవము విజయవంతమవుతుం దనుకోను.''

''ఏం — ఏమిటా ఆటంకం ?''

''మరేంలేదు — ఈ పురజనులు ఉత్సవ ఊరేగింపును మేళతాళాలతో మెయిన్‌రోడ్డు మీదుగా బజారు వీధిగుండా కోనేటి గట్టున ఉన్న శివాలయము వరకు తీసుకొనివెళ్ళి తిరిగి, ఖార్జావీధిలోంచి, పెద్ద మసీదు ప్రక్కనున్న చిన్న బజారులోంచి పెద్ద వీధిలోకి తీసుకొని వద్దామని అనుకున్నారు. ఎందుకేనా మంచిదని ముస్లిం పెద్దలకి తను ఊరేగింపును గురించి చెప్పేరు. ఆ పెద్దల్లో కొందరు చిన్నవాళ్ళ లీడర్లుచేరేరు. వాళ్ళు ససేమిరా అలా తీసుకొని వెళ్ళడానికి వీల్లేదన్నారు. వాళ్లు చాల నిబంధనలు పెట్టేరు. మసీదు ప్రక్కనుంచి వెళ్ళడానికి వీల్లేదన్నారు మసీదు దగ్గరలోనున్న చిన్నవీధి గుండా వెళ్ళినప్పటికి మేళతాళాలు పనికి రావన్నారు. వాళ్ళ సాయంకాల ప్రార్థనలకి ఆటంకంగా ఉంటుందట. ఇంకా వీధుల్లోంచి వెళ్ళే టప్పుడు ఎటువంటి నినాదాలు చేయకూడదట. ఇంకా ఏ విధంగా కూడ ముసల్మానులకు కోపంగాని, నష్టంకాని కల్గించకూడదట. దాంతో మన వాళ్ళంతా, అంటే హిందువులంతా చాలా కోపం తెచ్చుకున్నారు. 'ఇదేం పాకిస్థాననుకున్నారా ? మీరు చెప్పినట్లు మేము చచ్చినట్లు పడి ఉండడానికి. ఇది హిందూస్థాన్. మా ఇష్టమొచ్చినట్లు మేము ఊరేగిస్తాం, మా ఇష్టమొచ్చినట్లు పాడతాం, ఆడతాం, బాజా భజంత్రీలు వాయిస్తాం. అన్నిటికి అడ్డు చెప్పడానికి మీరెవరు ?' — దాంతో మాటా మాటా కాస్త పెరిగింది. ఇంతలో మౌల్వి ఖాసిం వచ్చి ఇరుపక్షాలని చీవాట్లుపెట్టి, అన్నదమ్ములైన హిందు, ముస్లిములు శాంతించేక మాట్లాడు కుందామని సభని చాలించేసేరు. ధర్మాజీ! ఖాసిం భాయి రాబట్టిగాని లేకపోతే ఘర్షణ తీవ్రంగా పోయేదే. ఎందుకో నాకు కాస్త భయంగానే ఉంది. ఇంతకీ మీ ఉద్దేశమేమిటి యిందులో.''

ధర్మాజీ ముఖం విచారంతో వాడిపోయింది.

''చూడు గోపాల్! ఒక గ్లాసునిండా విషముంచనుకో. అందులో ఎన్ని పాలచుక్కలు వేసినప్పటికి, అవి పాలుగా మారవు — గాని ఒక గ్లాసు నిండా పాలున్నాయనుకో, ఒక్క విషము చుక్కచాలు, ఆ పాలన్నిటిని విషముగా మార్చేయవచ్చు. అలాగే మంచి — చెడు. ఇన్నాళ్ళు ఏ అశాంతి లేకుండా, హిందువులు, ముసల్మానులు జీవిస్తున్నారా ఇక్కడ — గాని ఒక్క చుక్క విషం చాలు ఇంత బాంధవ్యాన్ని తునాతునకలు చేయడానికి. అందుకే ఆ బాంధవ్యాన్ని చెడకుండా చేయడానికి అందరం ప్రయత్నించాలి. అందరిమీద ఆ బాధ్యత ఉంది. అందుకే ఈ ఘర్షణకి కారణం హిందువులదా, ముసల్మానులదా అన్న ప్రశ్న అనవసరం, అవివేకం. పెట్రోలుమీద నిప్పువేసినా, నిప్పుమీద పెట్రోలు పోసినా ఫలితం ఒక్కటే. అందుచేత ఈ పరిస్థితి చేయిజారి పోకుండా చూడడం ఎంతైనా అవుసరం. మనం హిందువులం. ఈ భారతదేశంలో మనం అధికులం అన్న అహంభావం మనకుండ గూడదు. గోపాల్! ముఖ్యంగా మన తెలుగువాళ్ళకి చెప్పు — అనవసరంగా ఆవేశపడొద్దను. మనం ఇక్కడకు వలస వచ్చిన

వాళ్ళం. పరిస్థితులు విషమిస్తే ఎక్కువగా బాధ పడేది మన తెలుగువాళ్ళే. ఈ సంగతి మనవాళ్ళను మరచిపోవద్దను. నేను రేపు ఖాసిం భాయ్‌తో మాట్లాడుతాను — మీరు మరేం గాభరా పడకండి.''

* * *

ఖాసిం ఇంట్లో నలుగురు పెద్దలు, పిన్నల్లో లీడర్లు చేరేరు, ఒకనాటి సాయంకాలం.

''ఖాసింజీ — చూసేరా ఈ హిందువుల ఆగడం. మనం మైనార్టీలం — అందుకే వాళ్ళ అడుగులకు మడుగులొత్తాలిట. వాళ్ళు కావాలనే మన పెద్ద మసీదు ప్రక్కనుంచి ఊరేగిస్తా మంటున్నారు, బాజాభజంత్రీలతో. ఇంతకీ నినాదాలు మానరట. నేను రహస్యంగా కనుక్కున్నాను, వాళ్ళ నినాదాలేమిటో. శివాజీకి పరమ శత్రువులు ముస్లిములు — అందుకే ఔరంగజేబుకు బద్ధ వైరుడై శివాజీ మహారాష్ట్రము నుంచి ముస్లిము లను తరిమివేశాడుట. అలాగే ఇప్పుడున్న ముస్లిము లను ఈ దేశం నుంచి పాకిస్థానుకు ఈనాటి పౌరులు తరిమివేయాలట — ఇవి వాళ్ళ నినాదాలు. ఇన్నాళ్ళ మన మైత్రిని మరచిపోయేరు. ఇప్పుడు మనం శత్రువులుగా వాళ్ళకి కనిపిస్తున్నాం. అందుకే వాళ్ళు ఊరేగింపులో ఇటువంటి నినాదాలు చేయ డానికి మేమెవ్వరం ఒప్పుకోం. వాళ్ళుగాని అటువంటి కేకలు వేసేరంటే మేం ఊరుకునేది లేదు. మసీదు ప్రక్కన బాజా భజంత్రీలు వాయించేరంటే, వాటితోపాటు వాళ్ళను మూగవోయినట్లు చేసేస్తాం. ఖాసింజీ! వాళ్ళు ఈ శివాజీ జయంతి ఉత్సవాల నెపంతో మనపైన దౌర్జన్యం చేయాలనుకుంటు న్నారు. మనం ఊరుకుంటే మనకే నష్టం.''

''చూడు హాజీషకూర్! నువ్వు చాల ఆవేశంతో మాట్లాడుతున్నావు. నువ్వు ఎప్పుడైనా మన హిందు భాయిల గురించి ఇలా మాట్లాడేవా? ఇప్పుడెందుకిలా మాట్లాడుతున్నావు? ఇంతకీ వాళ్ళు ముస్లిములకు వ్యతిరేకంగా నినాదాలు చేస్తారని నీకెవ్వరు చెప్పేరు? ఇందులో ఏదో మోసముంది. మనల్ని హిందువులనుండి వేరు చేయడానికి ఎవరో పన్నిన కుట్ర ఇది. మీరు చెప్పుడు మాటలు విని మోసపోకండి. ఇన్నాళ్ళున్న మన మైత్రిని వమ్ము చేయకండి. అనుమానం దుఃఖానికి దారి చూపు తుంది. చేతులు కాలేక ఆకులు పట్టుకుంటే ప్రయోజనముండదు. అందుకే ఆవేశపడకుండా నా మాట వినండి. నేను ధర్మాజీతో, మిగతా హిందువుల పెద్దలతో మాట్లాడుతాను. మన పెద్ద మసీదువద్ద బాజాభజంత్రీలు ప్రయోగించవద్దని వేడుకుంటాను. ఏ నినాదాలు చేసినా మన మైత్రికి భిన్నంగా చేయవద్దని చెప్తాను. నామీద మీకేమాత్రం గౌరవాభిమానమున్నా మీరిలా ఆవేశపడవద్దు. శాంతిగా ఉండండి. చెప్పుడు మాటలు వినకండి. అనవసరంగా లేని దుఃఖాన్ని కోరుకోకండి. రేపు నేను అన్న ధర్మాజీని కలుస్తాను. ఇక వెళ్ళండి'' అని మౌల్వి ఖాసిం హితబోధ చేసి పంపేసేడు గానీ, మెల్లగా మనస్సులో భయం, విచారం గూడు కట్టుకున్నాయి.

* * *

''ఏం భాయ్ ధర్మాజీ! ఏమిటి అనవసరంగా గొడవలు వస్తున్నాయే.''

## ఉగాదీ!

సోదరీ! ఉగాదీ! స్వాగతం! సుస్వాగతం!

ఆంధ్రజాతికి ఆరవై మంది
ఆడపడుచులు మీరు
ఎన్నడూ పుట్టింటికి ఏకంగా రారు!
ఏడాది కొక్కరే ఎంచుకొని వస్తారు!
పెట్టిపోతలాశించి కాదు — మరేమీ
పట్టుకు పోటానికి కాదు!
సంతుభిత సోదర గణానికి
సంతోషం పంచిపెట్టటానికి!
భావిపై కొత్త ఆశలు
పల్లవింప జేయటానికి!

అంతేకాదు — మీ
అందరికీ ఆతిథ్య మిచ్చి
షష్ఠిపూర్తి చేసుకోగల
అదృష్టవంతులే అరుదు!
అటువంటప్పుడు —
ఉన్నా లేకపోయినా!
తిన్నా తినకపోయినా!
జీవితంలో వచ్చినన్ని ఉగాదులనైనా
ముదముతో ఆహ్వానించలేనివాడు
ముమ్మాటికీ దురదృష్టవంతుడు!

అందుకే సోదరీ! ఉగాదీ! స్వాగతం!!
నీకు హార్దిక స్వాగతం!!

— ఆర్. కె. కటారి

''చూడు ఖాసిం! భగవంతుడిమీద భారం వేసి మన ప్రయత్నం మనం చేద్దాం. నిప్పు రాజుకోకుండా సర్వవిధాల చూద్దాం.''

''నేను మావాళ్ళకి చెప్పేను. వచ్చే చిక్కేమి టంటే రెండువైపులా రెండు దుష్టశక్తులు చేరేయి. హిందువులు ఏదో చేస్తారని వాళ్ళు భయపడి క్రోధాన్ని తెచ్చుకోడం, ముస్లిములు ఏదో రభస చేస్తారని అనుమానపడి వీళ్ళు బందోబస్తు చేస్తుండడం ఏమి బాగులేదు.''

''అవును. ఈ అనుమానాలే, ఈ భయాలే ఏదో ప్రమాదానికి దారితియ్యొచ్చు. ఇందులోని చిత్రం ఏమంటే నా మాటంటే ఎంతో గౌరవంగా పరిగణించే వ్యక్తులే నా హితబోధలకి లెక్కచెయ్యటంలేదు. ఏవో దుష్టశక్తులు వాళ్ళని రెచ్చగొడ్తున్నాయి. అదే నాకు అంతుచిక్కటంలేదు. నువ్వు మీవాళ్ళకి బాగా నచ్చచెప్పు — ఆవేశపడవద్దని.''

''మొన్నను నేను చేసిందల్లా అదే — గానీ నా భయం ఏమిటంటే మావాళ్ళంతా చేయిజారి పోతున్నారనే. ఏవేవో వాళ్ళలో వాళ్ళు కూడ బలుక్కుంటున్నారు. ఏవో ప్లాన్లు వేస్తున్నారు. నన్నో ముసలివాడుగా, ఈ ప్రపంచం పోకడల్ని తెలియని వాడ్నిగా అనుకుంటున్నారు వాళ్ళు — గాని ఒకటి తెలియకుండా ఉంది, ఈ యువతరానికి. పొరుగు వాడింటికి నిప్పంటిస్తే, ఆ మంటల్లో తమ యిల్లూ కాలి నుసి అయిపోతుందని.''

''పరిస్థితులు విషమించకుండ మనిద్దరం రేపు ఓసారి కలెక్టరుగార్ని కలసి, ఎందుకైనా మంచిది, పోలీసు బందోబస్తు ఈ ఊరేగింపు రోజున ఎక్కువగా చేయాలని చెప్పివద్దాం — ఏం ఖాసిం భాయ్?''

''సరే, అలాగే చేద్దాం — మనవాళ్ళెవరు మన మాటలు వినేటట్లు లేదు.''

* * *

మరో వారంరోజులకి సాయంత్రం ఆరుగంటల సమయం — ఎక్కడ చూచినా హాహా కారాలు, మిన్నుముట్టే మంటలే. పీకలు తెగిపోతున్నాయి. రక్తం కాలువలై పారుతోంది. మూఢనమ్మకాలకి, మతం పేరిట అవివేకమైన పట్టుదలలకి, ఆవేశాలకి బానిసలై మనుష్యులు రాక్షసులైపోయేరు. పవిత్రములైన పెద్ద మసీదు, శివాలయం గోడల నుంచి కారే రక్తధారలకి మరకలై అపవిత్ర మౌతున్నాయి. గాంధీజీ చనిపోవడమే మంచి దైంది. లేకపోతే ఆయనే ఆత్మహత్య చేసుకునేవాడు ఈ రక్తస్రావాన్ని చూడలేక.

ఏనాటి నుండో దాగివున్న ఉద్రేకాలకి, ఉన్మాదాలకి మతం పేరిట దారిచూపుతున్నారు. మనుష్యులు చేస్తున్న ఈ పిశాచ నృత్యానికి అమాయకులు, వారితోపాటు అహంకారులు బలై పోతున్నారు. పరిస్థితులు చేయి జారిపోయేయి. గౌరవనీయులు, పూజ్యులైన ధర్మాజీ, ఖాసిం వంటి పెద్దలు చేసేదిలేక అశక్తులై ఇల్లు విడిచిపోలేక బయట జరుగుతున్న రాక్షసకృత్యాన్ని అరికట్టలేక, చూసి సహించలేక మతోన్మాదుల ఆవేశానికి బలైపోతున్న అమాయకుల ఆత్మలకి తర్పణంగ కన్నీరు కారుస్తు కూర్చున్నారు.

ఈ గొడవల్లో ఖాసింకు హృదయం పిండే మరో పరిస్థితి ఏర్పడింది. తనకు ప్రాణ సమాన మైన కొడుకు అక్బరుకు జ్వరం ఎక్కువైంది. ఆ రాత్రి కాస్త పలవరింతలు కూడ మొదలైనాయి. ఏ డాక్టర్ను పిలిచినా ఎవ్వరు బయటకు రాలేరు, ప్రాణంమీద ఆశ వుంటే. ఈలోగా వాల కొంపలకి నిప్పంటించేసేరు, దుండగులు. ఇట్లాంటి విషమ పరిస్థితుల్లో పిచ్చివాడై ఖాసిం, అతడి భార్య జహనారా బేగం కొడుకు మంచం ప్రక్కన కూర్చున్నారు, పచ్చి మంచినీళ్ళయినా పుచ్చుకోకుండా.

మరునాటికి పరిస్థితులు కాస్త చల్లబడితే మెల్లగా తను ధర్మాజీ ఇంటికి వెళ్ళి ధర్మాజీని పిలిచి తెద్దామనుకున్నాడు, లేదా అల్లా దయవల్ల పిల్లాడికి నిమ్మళిస్తే రెండురోజులాగవచ్చు.

కాని ఆ మరునాడు పోరాటాలు మరీ ఉధృతంగా జరుగుతున్నాయి. దండులుగా వెళ్ళి కొంపలు కాల్చేస్తున్నారు. దుకాణాల్ని, ఇళ్ళని దుండగులు లూటీ చేస్తున్నారు. తరువాత ఇళ్ళకు నిప్పంటించి ఆ కాలే ఇండ్లలో ఆ ఇంటివాళ్ళను ఆడ, మగ, పిల్లలు, పెద్దలు అన్న విచక్షణలేక పడేసి కాల్చేస్తున్నారు.

కారే రక్తానికి భూదేవి ముఖం సిగ్గుతో అరుణ వర్ణమైంది. రగిలే మంటపొగలకి ఆకాశం విషపూరితమై, నల్లనైంది. ఆ రోజంతా అక్బరుకి ఒంటిమీద తెలివిలేదు. కాస్త చీకటి పడుతుందనగా

# ఊరు చచ్చిపోయింది

పిల్లాడికి ఊపిరి సల్పడం బాధకరంగా ఉంది. ఎగ ఊపిరి మొదలైంది. ఖాసింకు పరిస్థితి అర్థమైంది. ఇంకా ఆలస్యం చేస్తే పిల్లాడు దక్కడు.

మెల్లగా మేడదిగి తన వేషాన్ని మార్చేసేడు. లుంగీ తీసి తెల్లని పంచె కట్టుకున్నాడు. దానిపైన వదులుగానున్న లాల్చీ తొడుక్కున్నాడు. పైమీద జలతారున్న శాలువ వేసుకున్నాడు. తన అనుచరుల్ని నలుగుర్ని వెంటబెట్టుకున్నాడు — ఆ నలుగురు ముష్కరులే. ఒక్కొక్కరి దగ్గర పదునైన కత్తులున్నాయి. వాళ్ళకి పరిస్థితులు విడమర్చి చెప్పి ఎలాగైనా డాక్టరు ధర్మాజీని తేవాలని చెప్పేడు. వాళ్ళను తనకు సంరక్షకులుగా చేసుకుని ఆ చిరు చీకటిలో ఆ ముసల్మాను పడానుంచి బయలుదేరేడు.

పెద్దవీధి వచ్చింది. పెద్దవీధిలో నుంచి నూరు గజాలు పోతే ధర్మాజీ ఇల్లు వస్తుంది. కత్తులు పట్టుకున్న అతని అనుచరులు పెద్దవీధి కొస్తే వారి తలలెగిరిపోవచ్చు. అందుకే ఆ వీధి మలుపులో దాగి ఉండమని చెప్పి ఖాసిం శాలువ ఒంటిమీద కప్పుకుని పెద్దవీధిలోకి ప్రవేశించేడు. కొంతదూరం పోయేక ఓకరౌడీ తారసపడి కత్తి ఎత్తి "ఎవరు నువ్వు" అని ప్రశ్నించేడు.

"నేనయ్యా మురారిలాల్‌ని — మా పిల్లాడికి బాగులేకపోతే మందుకోసం డాక్టరు ధర్మాజీ ఇంటికి పోతున్నా. నీ కోపం ఆ పాడు తురకల మీద చూపించు. నా మీదెందుకు. నన్ను వెళ్ళనీయవయ్యా."

"పో! త్వరగా పో! తురకల దండుగాని ఇటుగా వస్తే నిన్ను చంపేస్తారు," అని హెచ్చరించి వదలిపెట్టేడు. ఇతడు పలకరించి వదిలేయడం చూసి ఆ పెద్ద వీధిలో తిరుగుతున్న మిగతా రాక్షసులు మరేమీ అనలేదు; మన హిందువే కదా అని ఊరుకున్నారు.

గబగబా ధర్మాజీ ఇల్లు చేరి గట్టిగా పిలచేడు ఖాసిం. పరిగెత్తుకుంటూ వచ్చి ధర్మాజీ తలుపు తీసేడు. ఖాసిం వెంటనే తన కొడుకు విషమ పరిస్థితిని చెప్పేడు. అన్నీ విన్న ధర్మాజీ అదిరిపోయేడు. "ఆ కేసు డిప్తీరియా. వెంటనే వైద్యము చేయకపోతే ఊపిరి సలపక పిల్లవాడు చనిపోవచ్చు. పద. మందుల బ్యాగు, ఆపరేషను పరికరాలు తెస్తా,"నని లోనికి వెళ్ళేడు.

ఇంతలో ధర్మాజీ బయటకు వెళ్తున్నాడని

## చిరునామాలు : మనవి

పత్రికలో పడ్డ రచయితల చిరునామాలు కావాలని వ్రాయవద్దని మనవి. మీరు వారికి వ్రాసే ఉత్తరాలు కేరాఫ్ ఎడిటర్, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం అని వ్రాసి నట్లయితే — మా కార్యాలయం వాటిని "రీ డైరెక్టు" చేయడానికి ప్రయత్నిస్తుంది. కనుక రిప్లయి కార్డులు వ్రాయవద్దని మనవి.

— సం॥

తెల్సి భార్యా పిల్లలు వెళ్ళొద్దని ఎంతో బ్రతిమాలేరు.

"అక్బరు నా కొడుకుతో సమానమే. రక్తం పంచుకోకపోయినా, ఖాసిం నా తమ్ముడే. అక్బరు ప్రాణంతో మరో రెండు ప్రాణాలు ముడిపడి ఉన్నాయి. నా ప్రాణం పోతేపోనీ, నా విధి నిర్వహణలో. మీరంతా పెద్దై ప్రయోజకులయ్యేరు, నాకేమి చింతలేదు. ఇంతకీ ఖాసిం నా ప్రక్కనుంటే ఆ ముసల్మాను పడాలో నాకేమి భయం లేదు. నేను గంటలో వచ్చేస్తాను," అని ధైర్యం చెప్పి ఖాసింతో బయటకు వచ్చేడు.

డాక్టరు ధర్మాజీకి తెలియనివారు లేరుగనుక, ధైర్యంగా ఖాసింతో పెద్ద వీధి దాటి ముసల్మాను పడాలోకి వచ్చేడు. వెంటనే ఆ నలుగురు తురక ముష్కరులు వాళ్ళిద్దరికి సంరక్షకులుగా ఏర్పడ్డారు. అప్పటికే చీకటి పడింది. త్వరగా వెళ్తున్నారు ఖాసిం ఇంటివైపుకి.

పది నిముషముల తరువాత హఠాత్తుగా ఒకడు ధర్మాజీ ముఖంమీద టార్చి వేసి 'ఆగు' అని కేక పెట్టేడు, మరో చేతో కత్తి ఎత్తి. ధర్మాజీ ఆశ్చర్యపోయి ఆగిపోయేడు. వెంటనే వెనుకనున్న ఒక సహచరుడు ఆ కత్తి పట్టుకున్న చేయి పట్టుకుని,

"అబ్దుల్లా ఆగు! ఎవరనుకుంటున్నావు. మన డాక్టరుభాయి ధర్మాజీ!"

"అతడు హిందువుడేనా మరి?"

ధర్మాజీ అబ్దుల్లా కంఠాన్ని పోల్చేడు.

"అబ్దుల్లా! నీకు కన్ను ఆపరేషను చేసి దృష్టినిచ్చింది, ఆ దృష్టితోనే నన్ను పోల్చుకొని చంపడానికా? బాగుంది. నీకూ ఉన్మాదావస్థ బాగా పట్టిందే," అన్నాడు సౌమ్యంగా.

అప్పటికి అబ్దుల్లాకి కమ్మిన పొరలు విచ్చిపోయాయి. సిగ్గుపడిపోయాడు..

"క్షమించు ధర్మాజీ," అని తప్పుకున్నాడు.

మరో ఐదు నిముషములు గడిచేయి. మరో నూరు గజాల దూరంలో ఖాసిం ఇల్లుంది. ఆ మలుపులో ఒక వీది లైటుంది. ఆ వెలుతురు ధర్మాజీమీద పడింది. ఆ మలుపుకు ఎదురుగానున్న ఇంట్లో కిటికీ దగ్గర కూర్చుని ఒక ముష్కరుడు కత్తి నూరుతున్నాడు. అప్పటికే వాడు ప్రొద్దున్నించి ఓ పన్నెండుమందిని చంపేడు. కత్తి మొద్దుబారిందని రాయిమీద నూరుతున్నాడు. అతని భార్య పిల్లలకి తిండి పెడ్తూంది. అడుగుల చప్పుడు విని తలెత్తేడు. వీధి లైటు వెలుతురులో ధర్మాజీ అగుపించేడు. ఇంత గొప్ప వ్యక్తిని చంపితే ఘనంగా ఉంటుందని రివ్వున బాణంలా వచ్చి ధర్మాజీ వీపులో ఆ పెద్ద కత్తిని గుచ్చేసాడు.

అదే క్షణంలో వెనుకనున్న ఖాసిం అనుచరుడు ప్రమాదాన్ని గుర్తించి, చటుక్కున తన కత్తిని ఎత్తి ఒకేవేటుతో ఆ దుండగీడు తలని నేలగూల్చేడు. కానీ సమయం మించిపోయింది. ధర్మాజీ వీపులో ఆ పిచ్చివాడి కత్తి అదే క్షణంలో గుచ్చుకుంది. ధర్మాజీ నేలగూలేడు.

ఖాసిం, అతని అనుచరులు నిర్విణ్ణులయ్యేరు. ఎంతలో రెప్పపాటు కాలంలో అనుకోని ప్రమాదం

## ?

మృత్యు ముద్ర వుంది,
కాబట్టి — జీవితం మిథ్య.
వాసనాఛాయ వుంది
కనుక — ప్రేమ మిథ్య.
అసహన రేఖ వుంది
కాబట్టి — సఖ్యత మిథ్య.
మిథ్యాభావముంది
మరి — మిథ్యకూడ... ?

— విద్యారణ్య కామ్లేకర్

జరిగిపోయింది. మెల్లగా ఖాసిం చెయ్యి పట్టుకొని ధర్మాజీ నించున్నాడు. వీపులో కత్తి తీయవద్దన్నాడు. తనని పట్టుకొని త్వరగా ఖాసిం కొడుకు దగ్గరకు తీసుకొని వెళ్ళమన్నాడు. ఆలస్యం చేయవద్దన్నాడు.

ఖాసిం కొడుకుని పరీక్షించేడు. అప్పటికే ఆ పిల్లాడి ఊపిరి స్వల్పంగా వస్తూంది. వెంటనే మెడమీద గంటుపెట్టి రబ్బరు ట్యూబు ఊపిరి తిత్తులకు పెడ్తేగాని ప్రయోజనం లేదని బ్యాగ్ తెరిచేడు.

ధర్మాజీ షర్టు అంతా రక్తంతో తడిసి పోయింది. ధర్మాజీ ధర్మనిష్టకు, కర్తవ్య నిర్వహణ దీక్షకు ఖాసిం, అతని భార్య, అనుచరులు కంపించి పోయారు. అలాగే వాళ్ళు రోదిస్తున్నారు. ధర్మాజీ త్వరగా బ్యాగ్ తెరిచి చిన్నకత్తిని తీసుకున్నాడు. ఆపరేషను చేసి పిల్లాడ్ని బ్రతికించి, ఆ చిన్నారి ప్రాణంతోపాటు ఆ తల్లిదండ్రుల ప్రాణాల్ని కాపాడుదామని చేయి ఎత్తేడు. ఆ క్షణంలో ధర్మాజీ ప్రాణం పోయింది. కుప్పలా మంచం ప్రక్కన కూలిపోయేడు. మరో మూడు నిముషాలకి అక్బరు ప్రాణం పోయింది.

ఆ రెండు చావులు చూసేక ఖాసిం ఒకే కేక పెట్టేడు. "అల్లా ఈ రాక్షసులని క్షమించడు. ధర్మమూర్తి అయిన నా అన్న ధర్మాజీని చంపి, అందుమూలంగా నా ప్రాణ సమానమైన నా ముద్దు బిడ్డను చంపేసారు. అల్లా మిమ్మల్ని క్షమించడు" అని రోదిస్తునే పిల్లాడి శవంమీద నిర్జీవంగా పడిపోయాడు.

మెల్ల మెల్లగా మంటలు ఊరు నలువైపుల వ్యాపించేయి. ఎక్కడ చూసినా రోదనలే. ఊరంతా మనుష్యులు కాలిన గబురు కంపే. తెల్లవారేసరికి ఊరే చచ్చిపోయింది. ●

## అంకితం

"మతోన్మాదుల రాక్షసత్వానికి బలై పోతున్న నా హిందూ, ముస్లిం సోదర సోదరీమణులకు అశ్రువులతో అంకితం."

— వై. వరలక్ష్మీదేవి

**కొత్తది!**

ఇంప్రూవ్‌డ్

# విమ్

## సువాసనతో

**ఇది తళతళ తప్ప ఏదీ మిగల్చదు**

**...దాంతోటే, శుభ్రమైన తాజా సువాసన!**

సువాసన గల మెరుగైన విమ్ మునపటి కంటే ఎంతో, ఉత్తమమైంది. దీనిలో వున్న పుష్కలమైన నురుగు జిడ్డును పూర్తిగా వదలగొడుతుంది; పాత్రలు తళతళ మెరిసిపోతాయి... ఒక్క గీత కూడా పడదు!

మీ విలువైన స్టెయిన్‌లెస్ స్టీలు పాత్రలు, పింగాణీ సామాను, గరిటలు, చెంబాలు మొదలైనవి కొత్త వాటిలా కన్పిస్తాయి.

పైగా, మెరుగైన విమ్ మాత్రమే సువాసన గలది. అది ఎంతో శుభ్రమైన తాజా సువాసన ఇస్తుంది.






ఇంప్రూవ్‌డ్

**సువాసన గల విమ్ తో మిగతావాటిని మించిన మెరుపు.**

హిందూస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పాదన

లింటాస్-V. 80-293 TL

# దుర్మతిలో మీ భవిష్యత్తు...!

(7 వ పేజీ తరువాయి)

నవంబరు, డిశంబరు నెలలు, సర్వవిధాలా, అన్నిరంగాలలో లాభదాయకం. స్త్రీలకు: 82 జనవరి, ఫిబ్రవరి, మార్చినెలలు అనుకూల దాయకములు అభివృద్ధికి ఆకరవములు, ధనాదాయం సంభవం.

**తుల :** వత్సరమంతయు 'ఏలినాటి శని' వ్యయ సంచారం, అధిక వ్యయమును సూచించుచున్నది. ఆదాయాన్ని మించిన వ్యయం చేయవలసియుండును. గురుగ్రహం కూడా ఆగస్టు సెప్టెంబరు ప్రాంతాలవరకు వ్యయరాశియందు సంచరించుటచే అధిక వ్యయం, అందునను శుభ వ్యయం కూడా చెప్పదగిన అంశం. ఏప్రిల్ నుండి మొదటి మూడు నెలలు అనవసరపు త్రిప్పట, అధిక ఖర్చులు, ఆదాయలోపం, కాదగిన పనులు కాకపోవటం ఆశించిన 'ప్రమోషన్' రాకపోవటం, అనుకూలంగా పరిణమించే వ్యవహారాలు విలంబనం కావటం గమనించగలరు. జూలై 18 నుండి, అక్టోబరు ఆఖరు వరకు కొంతలో కొంత మేలుగా కాలం జరిగి పోవును. నవంబరు, డిశంబరునెలలు ఆదాయమందు వృద్ధి కనిపించును. 82' జనవరి నుండి మార్చి నెలాఖరు వరకు సర్వానుకూలత చెప్పదగిన అంశం. స్త్రీలకు: పూర్వార్ధానికన్నా ఉత్తరార్ధంలో అభివృద్ధి కార్యక్రమం అమలు పరచగలుగుట, క్రీడారంగ కళారంగ అవకాశాలు లభించగలవు.

**వృశ్చికం:**—వత్సరాది అన్నిరంగాలలో జయం, అనుకూలత చెప్పదగియున్నది. సంవత్సర ప్రారంభాన్నుండి ఆగస్టు 14 తారీఖువరకుశుభకార్యానుకూలత, ఉద్యోగాభివృద్ధి, నూతనోద్యోగ ప్రయత్నాలు సఫలం కావటం గమనింప గలరు. సెప్టెంబరు, అక్టోబరు నెలలందు వ్యాపారం సుగమంగా సాగి పోవుటమేగాక అధికంగా ఆదాయం సంభవం. నవంబరునుండి వత్సరాంతము వరకు చాలమందికి నూతన ప్రయత్నాలు ఫలించటం, శుభకార్యానుకూలత సంభవించటం, కోర్టు వ్యవహారాలు అనుకూలం కావటం, నూతన గృహ నిర్మాణ కార్యక్రమం సుగమంగా సాగటం యిత్యాది శుభ ఫలములు సంప్రాప్తింపనున్నవి. స్త్రీలకు: ఉద్యోగాభివృద్ధి, దూర దేశ ప్రయాణానుకూలత, కళా సాహిత్య రంగాలలో అవకాశాలు సంభవించుట, క్రీడారంగంలో నూతనంగా అవకాశాలు లభించుట గమనించ గలరు. ఆరోగ్యలోపం లేదు.

**ధనుస్సు:**—ఈరాశికి వత్సరమంతయు 'దశవ శని' మంచి ఫలితాలనివ్వదు. ప్రయాసమాత్రవే మిగులును. యత్న కార్యానుకూలత చెప్ప వీలులేదు. ఇరుగు పొరుగు వారితోయిబ్బందులు, అనవసరంగా పరులచే మాటలు పడుట, ఉద్రేక వాతావరణం సర్వత్రా కనిపించటం, ఉద్యోగవృత్తులందు పొరబాట్లుచేయుట గమనించ గలరు. నవంబరు 14 నుండి మార్చి 82' చివరవరకు కొంతలోకొంత మేలుగా వ్యాపారం సాగటం, పాత బాకీలు వసూల కావటం, ఇతరుల వలన జరుగవలసిన పనుల సుకరంగా జరగటం గమనింపతగిన అంశాలు. స్త్రీలకు :ఉద్యోగ వృత్తులందు జాగరూకత అవసరమని, క్రీడారంగంలో అవకాశాలు లభించినవి జారవిడువరాదని, నూతన ప్రయత్నాలకు ఆగస్టు 14 నుండి దిగవచ్చునని చెప్పదగిన అంశాలు.

**మకరం :** భాగ్యమందు 'శని' కొంతకాలం గురు గ్రహానికి అందే స్థితి యుండుట చేతను ఇతర గ్రహానుకూలతయు, అప్పుడప్పుడు శుభావహంగా తటస్థించుట చేతను, 'ఏప్రిల్' నుండి నాల్గు నెలల పర్యంతము అన్ని రంగాలలో అనుకూలత సిద్ధింప నున్నది. రాజకీయంగా, ఆగస్టు 14 నుండి డిశంబరు నెలాఖరు వరకు చాలమందికి ఈ రాశి వారికి శుభం చెప్పదగిన అంశం. జనవరి, ఫిబ్రవరి నెలలు క్రీడారంగంలో సంఘ సేవా పరాయణత్వంతో, సభా కార్యకలాపములందు పాల్గొనుటలో ప్రగతి కనిపించును. మార్చినెల మొదటి భాగం యోగదాయకమే. స్త్రీలకు: నూతనోత్సాహాలుండటం, యత్నకార్యసిద్ధి, నూతనోద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కావటం చాలమందికి క్రీడారంగంలో కళారంగంలో అనుకూల పరిస్థితులేర్పడటం గమనింప దగిన అంశాలు.

**కుంభం:**—ఈ రాశికి సంబంధించిన 'ధనిష్ఠ' నక్షత్ర జాతకులకు యోగదాయకం. వత్సరమంతయు అష్టమ శని సువర్ణమూర్తి. బృహస్పతియు అనుకూలుడు గాడు. ఏమైనను మొదటి ఆరు నెలలు ఏ విధంగా, ఏ రంగంలో వారికైనా కూడా కార్యవిజయం గాని, ఆదాయాభివృద్ధులు గాని సుకరంగా ఉండ గలవని చెప్ప వీలు లేదు. జూలై 14 నుండి 1982 మార్చి వరకు ఉద్యోగ వృత్తులందు, వ్యాపార రంగమందు, పత్రికాప్రకటనమందు, భారీ వ్యాపారమందు, జాయింటు వ్యాపారమందు, గృహ నిర్మాణ కార్యక్రమమందు, ఉద్యోగాభివృద్ధి యందు సుగుణం కనిపించ గలవని చెప్పదగిన అంశాలు. స్త్రీలకు: ఏప్రిల్ నుండి ఆగస్టు వరకు కార్యవిఘ్నం. సెప్టెంబరు నుండి డిశంబరు నెలాఖరు వరకు యత్న కార్యసిద్ధి, ఉద్యోగమందు అనుకూలత, కొందరకు 'ప్రమోషనులు' కూడా చెప్పదగిన అంశాలు. 82'నుండి మూడు నెలలు అన్ని రంగాల్లో అభివృద్ధి కనిపించునని చెప్పదగిన గోచారసంపద గల సంవత్సరం.

**మీనం :**- ఈ రాశికి 'సప్తమ శని' వత్సరమంతయు తామ్రమూర్తి. బృహస్పతి అక్టోబరు 27 వరకు, సప్తమ మందు రజత మూర్తి. ఏ విధంగా ఆలోచించినను, మొదటి మూడునెలలు, ఏప్రిల్ 5 తా. నుండి యోగదాయకములు గావని చెప్పదగియున్నవి. జూన్ జూలై నెలలందు వ్యాపారం సుకరంగాసాగటం, ఉద్యోగ వృత్తులందు సుగమంగా సాగిపోవటం, ఆగస్టు నుండి డిశంబరు వరకు చిత్ర కళారంగంలో అనుభవం గల వారికి, సంఘ సేవలో పరిచయం గల వారికి రాజకీయరంగానుభవం గలవారికి మంచి నెలలుగా పరిగణన. 82' జనవరి నుండి మార్చి మాసాంతం వరకు ఉద్యోగ వృత్తులందు ప్రగతి కనిపించును. స్త్రీలకు: వత్సరాది ఆరు నెలల పర్యంతం, ఏ రంగంలో కూడా అభివృద్ధి చెప్పవీలు లేదు. చివరి ఆరు నెలల్లో నూతన ప్రయత్నాలు ఫలించటం, శుభ కార్యాలకు అనుకూలత సంభవించటం, క్రీడారంగావకాశాలు లభ్యం కావటం, గమనించగలరు. ఆరోగ్యలోపం లేదు.

శుభం భూయాత్ !

—విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి.



# లిమ్కాతో అనుక్షణం సేదతీరును మరుక్షణం

లిమ్కా. జమైకన్ నిమ్మ మరియు సిసిలియన్ నిమ్మపళ్ల పుల్లని, తియ్యని రుచి, సువాసనల సంగమం. బాక్టీరియా రహిత పానీయం. మీ దాహం తీర్చడానికి దీనిలో 'ఐసోటానిక్' లవణాలున్నాయి. విటమిన్ సి కూడా. కాలరీలు కావాలనుకునేవారు ఇతర పానీయాలకు బదులు లిమ్కానే ఎంచుకుంటారు.

లిమ్కా. మీ ఇంటిల్లిపాదినీ రంజింపజేసి అన్ని వేళలా మీ సేదతీర్చే పానీయం—ఇంటా, బయటా కూడా.



ఈతకొట్టి పైకొచ్చాకా, ఇష్టంతో తాగేది లిమ్కా.
ఈత కొట్టాక సేదతీర్చే గుటక.



బాక్సింగ్ పిడులు మెచ్చేది, లిమ్కా వారికి నచ్చేది.
పోటీ తర్వాత సేదతీర్చే పానీయం.



సైకిలు తొక్కే సమయం, లిమ్కా పానం రసమయం.
మూడు తర్వాత సేదతీర్చే పానీయం.



పిక్నిక్ సరదా కిలకిలలు, లిమ్కా నవ్వుల గలగలలు.
బయటకు వెళ్లినప్పుడు సేదతీర్చే పానీయం.



క్యాంటీన్ కబుర్ల సమయంలో, మెదులును లిమ్కా మదిలో.
ఖులాసాగా కబుర్లు చెప్పుకుంటూ తాగే పానీయం.







RADEUS/PE/L-2-81

# చెక్‌మేట్

కన్నేపల్లి కామేశ్వరి



కమ్యూనిటీ హాలు కిటకిటలాడి పోతోంది.

నిర్జీవ వాతావరణంలో యంత్రాల నిరంతర రణగొణ ధ్వనుల నడుమ, కంపెనీ వాళ్ళ షిఫ్ట్ వేళల రొద, డీసెల్ పొగ, వర్కర్ల పై అధికారుల అజమాయిషీ, అధికారుల పై కార్మికుల ఉక్రోషం, గంటగంటకీ సైరన్ మోత– బ్రతుకంతా రొటీన్‌గా, మొనాటనస్‌గా సాగిపోయే ఆ కంపెనీ ఉద్యోగస్థులకది పర్వదినం.

అటువంటి సమావేశం కంపెనీ పుట్టుక నుండి అదే మొదలు.

## (గత సంచిక తరువాయి)

జోనల్ ఎడ్మినిస్ట్రేటర్ ప్రతాపరెడ్డిగారు హైదరాబాద్ నుండి వచ్చేస్తున్నారట.

వర్గ బేధం లేక అందరూ కలసికట్టుగా కూచున్నారు.

కాలనీ అంతా దాదాపు అక్కడే వుంది.

అనుకున్న సమయానికి ముందే ప్రాజెక్ట్ ఇంజనీర్, జడ్. ఏ. రెడ్డిగారు, మిగిలిన ఆఫీసర్లు అక్కడికి చేరుకున్నారు.

ప్రాజెక్ట్ ఇంజనీర్ రాఘవేంద్రన్ సభ ప్రారంభించేరు.

"లేడీస్ ఎండ జంటిల్మెన్. ఇది మన కంపెనీ చరిత్రలోనే మహత్తర దినం. ఇటువంటి దినాలు సంవత్సరానికి మూడుసార్లు మూడు సీజన్లలోనూ మీతో పంచుకోగలమని హామీ ఇస్తున్నాను.

మీ యావన్మంది నిరంతర కృషి వలన మన కంపెనీ ఎస్టైన్‌మెంట్‌లన్నీ నిర్ణీత కాలానికంటే ముందుగనే సంతృప్తికరంగా పూర్తవుతూ వస్తున్నందుకు కంపెనీ తరఫున మీకు కృతజ్ఞత అందచేస్తున్నాను. ఇరవై ఏళ్ళ ఈ కంపెనీ పురోగమనానికి సారధ్యం వహించినది మీరే.

ఇదే స్పిరిట్‌తో ఇకపై కూడా కంపెనీ ప్రగతికి పాటు పడగలరని విశ్వసిస్తున్నాను. ఇకపోతే, ఈ నెల నుండీ మన కంపెనీ క్రొత్తగా రూపొందించిన పథకాన్ని వివరిస్తాను.

ఒక్కో సీజన్‌లోనూ అన్ని శాఖల్లోనూ అత్యంత నైపుణ్యాన్ని, బుద్ధికుశలతని చూపి చెప్పుకోదగ్గ ప్రగతికి కారకులైన ప్రజ్ఞావంతులెవరైనా సరే, వారికి వెంటనే ప్రమోషన్ ఈయవలసిందిగా హైకమాండ్ ఆదేశమయింది. ఈ ప్రమోషన్‌లకి సర్వీస్ సీనియారిటీతో సంబంధం లేదు. ప్రమోషన్ ఈయలేని దశలో రెండు ఎడ్వాన్స్ ఇంక్రిమెంట్లు మంజూరు చేయబోతున్నాం!"

హాల్ మార్మోగిపోయింది చప్పట్లతో.

చప్పట్లు సద్దుమణిగేకా రాఘవేంద్రన్ మళ్ళీ కొనసాగించేరు.

"ఈ సీజన్ విజేతల ఎంపిక ఈసరికే పూర్తయింది. ఈ సమావేశానికి హాజరైన మీలోనే అత్యంత ప్రతిభాశాలురున్నారు. మన జడ్. ఏ. గారు వారిని స్వయాన సత్కరిస్తారీ వేదిక మీద.

ఈనాటి విజేత మీ ప్రక్కనున్నతను కావచ్చును. కానీ రేపటి విజేత మీరే ఎందుక్కాకూడదు? ఇది కేవలం లాటరీలోలా అదృష్టానికి పరీక్ష కాక మీలో కార్యనిరతకి కంపెనీ ఇచ్చుకునే ప్రశంస.

ఇప్పుడు విజేతల పేర్లు వినిపిస్తాను..."

శ్రోతలు ఉక్కిరి బిక్కిరయ్యేరు ఈ అనూహ్య సంఘటనకి.

ఊహాగానాలు మొదలయ్యేయి.

వేదిక మీదికి ఆహ్వానింపబడే విజేతలెవరైయ్యుంటారా! నన్న ఉత్కంఠతో ఆడా, మగా అంతా సావధానులై చూస్తున్నారు.

# చెక్ మేట్

ప్రతి కార్మిక హృదయమూ కొట్టుకుంటోంది వడివడిగా. జీవితం ఒక్కసారి మలుపు తిరగబోతున్నట్టు వెన్నుముక జలదరిస్తోంది సూది పడినా వినిపించేటంత నిశ్శబ్దం.

రఘువేంద్రన్ తృప్తిగా తల పంకించి కాగితం తీసేరు జేబులోంచి

"ఫేబ్రికేషన్ వింగ్ - శ్రీ తిరుముగం పిళ్లై వేదిక మీదికి రావలసిందిగా ఆహ్వానిస్తున్నాను."

చప్పట్లు, కేకలు.

నలభై ఏడేళ్ల పిళ్లై ఒక్క క్షణం చేతనావస్థ కోల్పోయి, మరేదో లోకం నుండి ఊడిపడ్డ వాడిలా తూలుతూ వేదిక వైపు నడుస్తున్నాడు మిగిలిన వాళ్ళు అతన్ని మెచ్చుకోలుగా చూస్తూ, త్రోవ విడిచి పెడుతున్నారు.

పిళ్లై చేసిన ఘనకార్యాన్ని వేదికమీద వర్ణిస్తున్నారు ప్రాజెక్ట్ ఇంజనీర్.

"ఎరక్షన్ వింగ్ నుండి - శ్రీ టి. వి. కాంతారావ్"

కాంతారావ్ స్తబ్దుడై పోయాడు.

రెండు నిమిషాల పాటు గుండె కొట్టుకోవడం మర్చిపోయింది.

ఆరాధనా పూర్వకంగా భర్త వైపు చూస్తోంది శ్యామల.

మరో రెండు వింగ్‌ల్లోంచి మరోఇద్దరికి బహుమతి లభించింది.

అంత్యోపన్యాసంలో ప్రతాపరెడ్డి వివరించేరు.

"మీలో దాగివున్న ప్రతిభని, కార్యదక్షతని గుర్తించి కంపెనీ మీ కిస్తున్న ఈ చిన్న కానుకను హృదయపూర్వకంగా స్వీకరించేరని విశ్వసిస్తున్నాను. ఈనాటి బహుమతి రానందుకు ఏ మాత్రం నిరాశ చెందక రేపటి బహుమతి కోసం ఎదురు చూడమని విజ్ఞప్తి చేస్తున్నాను.

కంపెనీకి మీరు కన్న బిడ్డల్లాంటి వారు. తెలిసీ తెలియక తల్లిదండ్రులు మీ పట్ల కఠినంగా ప్రవర్తించినా ఎదురుతిరిగే మనస్తత్వంలేని భారతీయరక్తం మనందరిలోనూ వుండాలని కాంక్షిస్తున్నాను. జైహింద్!!"

సాంస్కృతిక కార్యకలాపాల అనంతరం సభ ముగిసింది.

"గురుమూర్తి ఈర్ష్యతో ఉడికిపోతున్నాడు శ్యామూ!"

"ఎందుకట?"

"వాడు నా కన్నా సీనియర్ ఈ ప్రమోషన్ కోసమే రెండు సంవత్సరాలుగా వాడు కంటున్న కలలు కళ్లలోనే నందుకు, వాడు కట్టుకున్న గాలిమేడలు మొదలంటా కూలిపోయినందుకు..."

"సహజమే మరి."

"అవునే. నువ్వెప్పుడు నన్ను సపోర్ట్ చేసేవ్ గనుక! లోకమంతటా నీకు మంచి తనమే కన్పిస్తుంది- ఒక్క నాలో తప్పించి."

"అవునండీ; ఎదుటి వారిలో తప్పులు వెతికే శ్రమ మనసుకి కలిస్తే, కొన్నాళ్ళకి మనం చేస్తున్నది తప్పో, ఒప్పో తెలియని దీన స్థితిలోకి జారుకుంటాం."

"పుట్టుకొచ్చిందండీ ప్రవచనం! నీతో మాట్లాడ్డానికే భయం వేస్తుంటుంది శ్యామూ తనకన్నా తెలివైన భార్యని భరించడం కష్టమని భర్తృహరి కాబోలు ఉవాచించేడు. ఏడిచే వాళ్ళను ఏడ్వనీ శ్యామూ... వాడి సంగతి మనకెందుకు గానీ, ఇదిగో ఇటు చూడు."

డైరీ తెరచి ఆ రోజు వ్రాసుకున్న దాన్ని ఆమెకు చూపించేడు కాంతారావ్.

చివరివరకూ చదివి తేలిగ్గా నిట్టూర్చింది శ్యామల.

ఆమె కళ్లల్లోకి సూటిగా చూస్తున్నాడతను.

* * *

"అదృష్టవంతుడివి భాయ్! కలలో కూడా ఊహించని విధంగా ప్రమోషన్ కొట్టేసేవ్. ఇప్పుడు మీ ఫోర్‌మన్ బాధ తప్పింది నీకు. కంపెనీ క్రొత్త నిర్ణయం నీ జీవితాన్ని విచిత్రమైన మలుపు తిప్పింది. ఎక్కడ సర్కార్‌గా పని చేసేవో అక్కడే ఫోర్‌మెన్ కావడం నిజంగా అదృష్టం." అన్నాడు నిక్సర్ టీ చప్పరిస్తూ.

పిళ్ళై నలుదిక్కులా పరికించి చూసేడు. రహస్యం చెప్తున్నట్టు గొంతు తగ్గించేడు.

"ఇది అదృష్టమో, దురదృష్టమో అర్థం కావడంలేదు భాయ్! మనలోవాడే కదాని ధీమాతో సరిగ్గా పనిచెయ్యని వర్కర్స్ని కసిరికొట్టాల్సి వస్తోందిప్పుడు. నిన్నటి వరకూ వాళ్లతోపాటే పాత ఫోర్‌మేన్‌ని దుమ్మెత్తిపోసిన నేను, ఈ క్షణాన క్రొత్త

హోదాలో వాళ్ళని కంట్రోల్ చేయాల్సి రావడం నరకంలా అనిపిస్తోంది.''

విక్టర్ జాలిగా చూసేడు పిళ్ళై వైపు.

"అది సహజమే పిళ్ళై భాయ్ నీ హృదయం సున్నితమయినది కాబట్టి నువ్వంతగా బాధ పడుతున్నావ్. పని రాబట్టు కోవాలంటే అధికారం చెలాయించక తప్పదు.''

పిళ్ళై ఏడ్వలేక నవ్వుతున్నట్టు మళ్ళీ చెప్పేడు.

''క్రొత్త పోస్టుకన్నా పాత పోస్టే బాగుండేది భాయ్ అప్పట్లో బోలెడంత ఓవర్ టైమ్ దొరికేది. ఇప్పుడు వాళ్ళ ఓవర్ టైమ్‌ని రికమెండ్ చెయ్యాల్సిన గాడిద చాకిరీయే మిగిలింది ఈ ప్రమోషన్ ధర్మమాని !''

విక్టర్ తెల్లబోయాడు

టీ గుటక వేయడం మరచిపోయినవాడిలా పిళ్ళై వైపు చూస్తున్నాడు ఆశ్చర్యంతో.

* * *

# చెక్ మేట్

ఆరుసంవత్సరాలు సునాయాసంగా గడిచి పోయాయి.

పేరివిజన్ జరిగింది.

బోనస్ కూడా లభిస్తోంది.

కంపెనీ క్రొత్తబలం పుంజుకొని చాక చక్యంతో వర్క్ ఆర్డర్లు సంపాదిస్తోంది దేశమంతటా. దాని విజృంభణకి మిగిలిన కంపెనీలు తట్టుకోలేక తోకముడుస్తున్నాయి.

ఇతర కంపెనీ ఉద్యోగస్థులు ఈ కంపెనీ ఉద్యోగాలకి ఎగబడుతున్నారు.

క్వార్టర్ ముందు జీప్ ఆగిన శబ్దానికి శ్యామల ఉలిక్కిపడింది. కాంతారావ్‌ని దిగవిడిచేకా జీప్ ముందుకి దూసికపోయింది.

కాంతారావ్ విసురుగా నడిచేడు ఇంట్లోకి.

బట్టలు మార్చుకోకుండానే సోఫాలో కూలబడ్డాడు, రెండు చేతుల్లోనూ తల పట్టుకుని.

భర్త వికారాన్ని గుర్తించింది శ్యామల.

"ఏం జరిగిందండీ ? ఎందుకలా నీరుకారి పోతున్నారు ?''

"ఇంకా ఏం జరగాలి ? ఈ కంపెనీని నమ్ముకున్నందుకు మంచి శాస్తి జరిగింది. ఆ దొంగ రాస్కెల్ భామమూర్తి గాడికి నన్ను సూపర్‌సీడ్ చేసూ ప్రమోషనిచ్చేరు.''

"ఎందుకని ?''

"ఎందుకేమిటి? నా ఖర్మ తగలడింది కాబట్టి! వచ్చినప్పట్నుండి చూస్తున్నాను. వెధవ అందరికీ గాలి కొడుతున్నాడు. అప్పుడే అనుకున్నాను, ఎప్పటికైనా వీడు నా కొంప ముంచుతాడని సరిగ్గా అలానే జరిగింది నా కంటే వీడేం ఒరగబెడుతున్నాడని ప్రమోష నిచ్చేరు? మన రోజులు బాగులేవు శ్యామూ! పిచ్చెక్కినట్టవుతోంది నాకు !''

శ్యామల జవాబు చెప్పలేదు

భర్త వైపు నిశితంగా చూసి ఇంట్లోకి నడిచింది.



తిరిగి వాడుకొనుటకు ఆకర్షణీయమైన కన్‌టైనరు.

కప్పు హార్లిక్సుతో తిరిగి వచ్చింది.

"మీరేమీ బాధపడనంటే..." అర్ధోక్తిలో ఆగిపోయింది.

"ఏమిటి ?"

బీరువా తెరిచి బట్టల అడుగున వెతికి డైరీ తీసుకొచ్చింది.

ఆరేళ్ళ క్రిందట కాంతారావ్ వ్రాసికున్న డైరీ.

శద్ధగా వెతికి ఒక కాగితాన్ని కొద్దిగా మడతపెట్టి కాంతారావ్ ముందు పడేసింది.

"ఇప్పుడెందుకిది ?"

"దాని అవసరం ఇప్పుడే వచ్చింది కనుక! తిరిగా చదువుకోండి. మీ వర్తమాన స్థితి అర్థమవుతుంది; మనస్తాపం చల్లారుతుంది" లోపలి గదిలోకి వెళ్ళి పోయిందామె భర్తని ఒంటరిగా విడిచిపెట్టి.

కాంతారావ్ తన అక్షరాలని తానే నమ్మలేక పోతున్నాడు. అప్పుడు తన వ్రాత ఎంత కుదురుగా ఉండేది! వరుసలు ముత్యాల సరాల్లా ఎంత ముద్దొను న్నాయి!

కాంతారావ్ ఒళ్ళు తేలికయింది.

మంగళవారం.—

సెప్టెంబర్, పదవతేదీ, డెబ్బయ్‌నాలుగు.

"ఉత్త పుణ్యానికే నాకు ప్రమోషనొచ్చి నట్టు ఒకటే కుళ్ళిపోతున్నాడు గురుమూర్తి గాడు. సర్వీసులో సీనియారిటీ ఉన్నంత మాత్రాన వీడికే ప్రమోషన్ ఇవ్వాలన్న నియమ మెక్కడుంది గనుక! మొన్న ఆదివారం రాత్రి ప్రాజెక్ట్ ఇంజనీర్ నలుగురి లోనూ చెప్పినది వీడి తల కెక్కలేదన్నమాట!

వీడి చేతకాని తనానికి ఏడవకుండా మరొకడి ప్రగతిచూసి ఓర్వలేక ఏడుస్తున్నాడు.

ఈర్ష్య, అసూయ మనిషిని పశువుగా మారుస్తాయట; శ్యామల అంటుంటుంది అప్పుడప్పుడూ.

ఏడ్చుకునే వాళ్ళని ఏడవనీ–దేవుడు వాళ్ళ జీవితాలకి ఏడుపే వ్రాసిపెట్టేడు కాబోలు!!

సామర్థ్యం లోపించినప్పుడు ఏ కంపెనీ మాత్రం ఎందుకని గౌరవిస్తుంది, ఎందుకని పీరాజన మిస్తుంది ? ?"

చెళ్ళున కొరడాతో కొట్టినట్టయింది కాంతారావ్‌కి.

వడి వడిగా పరిగెత్తే తనను ఎవరో అకస్మాత్తుగా నిలబెట్టినట్టయింది.

డైరీతో లోపలి గదిలోకి పరిగెత్తేడు భార్యని వెతుక్కుంటూ.

## అంతరిక్షంలో మిశ్రమలోహ తయారీ!

భూమిపైన చేయడానికి వీలుకాని వినూత్న ప్రయోగాన్ని జపాను శాస్త్రజ్ఞులు అంతరిక్షంలో విజయవంతంగా నిర్వర్తించగలిగారు. సాపేక్ష సాంద్రత సమానంగా లేని కొన్ని లోహములను కరిగించినప్పటికినీ అవి ఒక దానితో మరొకటి కలిసి మిశ్రమంగా మారవు. అయితే భార రహిత స్థితిలో అవి కలసి క్రొత్త మిశ్రమ లోహములుగా మారగలవు. భార రహితస్థితి అంతరిక్షంలో, రాకెట్ యింజన్ నుండి విడిపోయిన తరువాత ఏర్పడుతుంది. అటువంటి దశలో, అంతరిక్షంలో యీ ప్రయోగాలు జరిపి క్రొత్త మిశ్రమ లోహములను తయారు చేయడంలో వారు విజయాన్ని సాధించారు.

# హైదరాబాద్ నోట్‌బుక్

**నూతన సభాపతి శ్రీ కోన ప్రభాకరరావు**

రాష్ట్ర విధానసభ సభాపతిగా (స్పీకరుగా) శ్రీ కోన ప్రభాకరరావు ఫిబ్రవరి 24న ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. [ఈ వార్త గడచిన వారమే హైదరాబాద్ నోట్‌బుక్ సంక్షిప్తంగా ప్రచురించింది] తాత్కాలిక సభాపతి శ్రీ చింతలపాటి మూర్తిరాజు ప్రశ్నోత్తరాల అనంతరం ఈ మేరకు ఒక ప్రకటన చేశారు. శ్రీ కోన ప్రభాకరరావును బలపరుస్తూ తొమ్మిది నామినేషన్లు దాఖలయ్యాయని, గడువులోగా మరొక నామినేషన్ రానందున శ్రీ ప్రభాకరరావు ఏకగ్రీవంగా ఎన్నికయ్యారని ఆయన ఆ ప్రకటనలో తెలిపారు. శ్రీ ప్రభాకరరావు సభాపతి స్థానం స్వీకరించగానే సభ్యులందరూ హర్షనాదాలు చేశారు. శ్రీ ప్రభాకరరావు గుంటూరు జిల్లా బాపట్ల నియోజకవర్గంనుంచి విధానసభకు ఎన్నికయ్యారు. 1967 నుంచి ఆయన ఆ నియోజకవర్గ ప్రతినిధి. ఆయన న్యాయశాస్త్ర నిష్ణాతుడు. చలనచిత్ర నటుడు, నిర్మాత, దర్శకుడు. ద్రోహి చిత్రంలో ప్రముఖపాత్ర వహించి, ప్రజాదరణ పొందారు. రెండు చిత్రాలకు దర్శక నిర్మాత. తర్వాత న్యాయవాద వృత్తి చేపట్టి రెండు దశాబ్దాలుగా ఆ వృత్తిలో ఉన్నారు. విధాన పరిషత్తుకు శ్రీ ముఖ్లిర్‌షా అధ్యక్షుడుగా ఏకగ్రీవంగా ఎన్నికైనారు. ఉభయ శాసనసభల సంయుక్త సమావేశం ఫిబ్రవరి 20న జరిగింది. శ్రీ అంజయ్య ముఖ్యమంత్రి అయిన పిదప ఉభయ శాసనసభల సమావేశం కావడం ఇది తొలిసారి. నిజానికి పెక్కు నెలల పిదప విధానసభ సమావేశం కావడం కూడా ఇదే ప్రథమం.

**ఉపశ్రుతి :**

సుప్రసిద్ధ సంస్కృత కన్నడ కవి శ్రీ పెరుమాళ్ల గుండాచార్యులు గారు [సురపుర వాస్తవ్యులు] అకాలంలో స్నానం చేస్తున్నారు. ఏమిటి సార్ బావి గట్టున వేళగానివేళ స్నానం అనడిగాను. మైల పడ్డాను అన్నారు ఆయన. ఏమిటీ? ఎలాటి మైల? శారీరకమా, మానసికమా? అన్నాను. మానసికమే. కోపపడడం మైల అని పూజ్యపాదుల శ్రీ కులశేఖర యతివర్యులు [అయోధ్యావాసులు] సెలవిచ్చారు. కోపం వచ్చినప్పుడల్లా ఆయన స్నానం చేసేవారు. నేనూ ఆ పద్ధతే అనుసరిస్తున్నాను అన్నారు. ఆచార్యులవారు నిత్యకోపి అయితే గతి ఏమిటి? నిరంతరం బావిలోనే మునిగి ఉండాలి కాబోలు అనుకుని కుక్కిన పేనులాగా ఉండిపోయాను.

— తిరుమల రామచంద్ర

# వారఫలం

## 10-4-1981 శుక్రవారం మొదలు 16-4-1981 గురువారం వరకు

మేషం : రాశికి గ్రహస్థితిలో కొన్ని గ్రహాలవలన అనుకూల మార్పులు రావటంచేత, వ్యాపార వ్యవహార సాహిత్య కళా రంగాలలో అనుకూలత ఏర్పడనున్నది. బాగా వ్యాపారం సాగటం, ఉద్యోగంలో చాలమందికి 'ప్రమోషన్లు' ఆశింపదగినవారం. స్త్రీలకు: విద్యాభివృద్ధి, ఉద్యోగ మార్పులు, ఆదాయం చెప్పదగిన సమయం.

వృషభం : ఉత్తమ వారఫలం ఆశింపదగిన సమయం. కృషి చేయుటమే తరువాయి. అన్ని రంగాలలో అనుకూలతగలదు. రచనా విధానంలో, చిత్రరంగ వ్యాపారంలో, పత్రికా ప్రకటనా విధానంలో ఆదాయమున్నది. స్త్రీలకు: నూతనోద్యోగ ప్రయత్నాలు సాగటం, శుభ ప్రస్తావనలుండటం గమనింపదగిన అంశం.

మిథునం : ఆటంకాలు, అంతరాయాలు, అనానుకూల పరిస్థితులు, చేయదలచే దొకటి జరిగే విషయం ఒకటిగా నుండగలదు. ప్రతి పనిలో ఆటంకాలకు కొరతలేదు. ఇందుకు తోడు ఆరోగ్య భంగం కూడా చెప్పదగిన అంశం. స్త్రీలకు: అర్ధాష్టమ శనిబాధ, వేధ చెప్పదగిన అపకారానికి దారితీయగలదు. జాగ్రత్త పడాలి.!

కర్కాటకం : రచనా వ్యాసంగం ఫలవంతం. కృషికితగిన ఫలితం, ఆర్థిక రూపాన పొందనున్నారు. ఇంట శుభకార్యం జరిగే మార్గమున్నది. ఏవో అనవసరపు పనులకు కొందరు ఉసి కొల్పుతారు. ఆ పథకానికి లొంగిపోకండి. ధనాదాయంగల వారం. అప్పులు తీర్చవలసిన అవసరం కూడా ఏర్పడగలవారం. స్త్రీలకు : విద్యా వైజ్ఞానిక రంగాలలో ప్రగతి ఏర్పడగలదు.

సింహం : చాల విధాల ఇబ్బంది ఏర్పడగల వారం. ఆరోగ్యలోపం. అజీర్ణ వ్యాధి మూలాన సంభవం. మీ తాలూకు వస్తువులుపోయే అవకాశమున్నది. జాగ్రత్త ! ధన లోపమున్న హాయిగా వారం గడిచే మార్గమున్నది. స్త్రీలకు: వయసులోనున్న వారికి శుభ కార్యాలోచనలుండగలవు. కొందరకు సంతానం మూలాన సంతోషం అతిశయించగలవారం.

కన్య : ఏదో నాకు రాదగిన అవకాశం రాలేదనీ, కావలసిన పనులు త్వరగా కావటంలేదని ఆందోళన పడుతారేగాని గ్రహస్థితిని గూర్చి యోచించరు. మానసికంగా ఏమాత్రం బాగుండలేదని గ్రహిస్తారు. రాబడిచాలదు. వ్యాపారస్థులకు సామాన్యావకాశాలకు లోపంలేదు. స్త్రీలకు: ఉత్తరాల మూలాన అనేక విషయాలు తెలిసికోవటం, నూతన వస్త్ర సేకరణ చేయుటం, రాజకీయంగా సత్ఫలితాలను పొందటం సంభవం.

తుల : శుభవ్యయం కనిపిస్తుంది. దాయాది వర్గంనుండి ఏదో మనసుకు వేదన కలిగించు వార్త వినగలరు. అయినవారితోనో, మిత్రులతోను విబేధపడనున్నారు. వస్తువులు పోగొట్టుకోకుండా చూచుకోండి, స్త్రీలకు: కుటుంబ భారం ఖర్చులు అధికం కావటం, తలచిన పనులు జరుగక పోవటం, వ్యయరాశిస్థిత శనిగ్రహ ప్రభావం.

వృశ్చికం : బంధువులు రాగలరు. వ్యాపార లోపం ఏమాత్రం కనిపించదు. వ్యవహారం పరిష్కరించుకొనుటకు అనువైనవారం. కుటుంబంలో వయసు మీరినవారి ఆరోగ్య విషయంలో శ్రద్ధాసక్తు లవసరం. అనవసరంగా వ్యయం తప్పదు. స్త్రీలకు: సుఖ సంతోషాల లోటులేదు. ఉద్యోగించేసే వారైతే అభివృద్ధి గలవారమే.

ధనుస్సు : 'మాటకుమాట తెగులు' పూరక మాట్లాడకండి. అలాంటి సంభాషణవలన బంధువర్గీయులతో, మిత్ర సంఘంతోమాట పట్టింపులు రాగలవు. తద్వారా మానసిక వేదనకూడ సంభవం. స్త్రీలకు : ఏవిధంగాకూడా మేలు జరుగుతుందని చెప్పవీలులేనివారం. పనులకు ఆటంకాలుండగలవు.

మకరం : పూరకకాలహరణం చేయాలని తోస్తుంది. అదెంతమాత్రం తగదు. నిర్దిష్ట ప్రణాళికానుసారం కార్యాచరణగావించండి. కృషి చేయండి. ధనార్జనకు తగిన అవకాశాలున్నాయి. సాహిత్యపరంగా క్రీడావనిలో, రాజకీయంగా ఆయా రంగాలలో ప్రవేశమున్నవారికి కాలం సుగమంగా, సుగుణప్రాయంగా ఉంటుంది. స్త్రీలకు: కావలసినన్ని అవకాశాలుండగలవు. వినియోగించుకోవాలి.

కుంభం : చిక్కిన అవకాశాలను సద్వినియోగం చేసికోవటం ఒకవిధంగా నేర్పరితనమే అనవచ్చు. కళారంగ ఖ్యాతి ఇనుమడింపగలకాలం. వ్యాపారంలో ఏవిధంగా లోపం రాదు. అయినా అధికారులను ఒకకంట కనిపెట్టాలి. స్త్రీలకు: విద్యారంగంలో అవకాశాలుండటమే గాక విదేశ పర్యటన చేయాలనే సంకల్పం సంభవం.

మీనం : జరిగిపోయిన వ్యవహారాలను గూర్చి, సంభవించిన నష్టాన్ని గూర్చి, ధన ధాన్య సేకరణ యందు కలిగిన విలంబనాన్ని గూర్చి ఆలోచింపకండి. కృషి చేయండి. అన్నిరంగాల వారికి అన్ని విధాలా ఆదాయం, అవకాశాలు సమకూరగల వారం. స్త్రీలకు : ఉద్యోగ ప్రయత్నాలు ఫలించటం కొందరకు శుభ కార్యాలోచనలతో వారం గడుస్తుంది. కించిత్తు ఆదాయానికి లోటు లేదు. ఈ వారం ఉత్తమ ఫలప్రదాయకమే.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



## ఆత్మరక్షణ !

న్యూజర్సీకి చెందిన 25 ఏళ్ల రోక్సెన్‌గే అనే ఆమెను ఆమె భర్త వీలుచిక్కినప్పుడల్లా చితక బాదుతూండేవాడట. ఈ సంబంధంగా ఆమె 21 సార్లు పోలీసురిపోర్టు యిచ్చిందట. సామాన్యంగా భార్యలు ఈ రకమైన రిపోర్టులు ఇవ్వడం సహజమైనందువల్ల పోలీసులు వీటిని సీరియస్‌గా తీసుకోరట. అయితే రోక్సెన్‌గే కూడా అందరి మహిళలులాగే ఇచ్చిన రిపోర్టు ఉపసంహరించుకుని, ఆనక ఆరు అడుగుల అయిదంగుళాలు ఎత్తుండి ప్రఖ్యాత ఫుట్‌బాల్ ఆటగాడైన తన భర్తను కాల్చిచంపేసి, అదేమని కోర్టువారు ప్రశ్నిస్తే 'నన్ను కొట్టికొట్టి చంపుతున్నాడు. ఆత్మరక్షణ కోసం నా కంతకన్నా మార్గం లేదు పొ'మ్మందట.

## సంసారం సాగరం.... !

అమెరికాలో వివాహమంత నరకం ఈ భూప్రపంచంలో మరొకటి లేదు అనే పద్ధతికి అక్కడి నాగరికత వచ్చేసిందట. పవిత్ర వివాహ బంధం అంటే అక్కడివారు ఫక్కున నవ్వుతున్నారట. డాక్టర్ జొయిసి బ్రదర్స్ అనే ఆవిడ కొన్ని వేలమంది వివాహితులను కలుసుకుని చర్చించి సర్వేచేసి సమర్పించిన రిపోర్టు ప్రకారం ప్రతి పన్నెండు వివాహాలలో నాలుగు వివాహాలు విడాకులలో తేలుతున్నాయనీ, మరో ఆరు వివాహాలు తప్పనిసరైన పరిస్థితులలో పిల్లల కోసం ఆస్తిపాస్తులకోసం సాంఘిక మర్యాద కోసం అలా పాడిపాడిగా విడాకులకు పోకుండా వుంటున్నాయనీ, తెలిసిందట. స్త్రీ పురుషులు స్వతంత్ర భావాలు కలవారయితే ఎవరి మాట ఎవరు వినాలనేది తేలక పోతే విడాకులే శరణ్యమవుతూన్నదని ఆ డాక్టరు గారు అభిప్రాయ పడ్డారట. పడరూ మరి !



## సరదాకి వ్యభిచారం !

అమెరికాలో ఎంత హీనంగా లెక్కలు చూసినా కనీసం 13 లక్షల మంది వేశ్యలున్నారని లెక్కలు తేలాయట. వీరిలో సెక్రటరీలుగా పనిచేసే అమ్మాయిలు, కుటుంబ స్త్రీలు కూడా ఉన్నారట. అనగా అమెరికాలో ఉన్న స్త్రీ జనాభాలో ఒకశాతం వ్యభిచారులని చెప్పవచ్చునట. న్యూయార్క్‌లోని చైల్డ్ వెల్ఫేర్ ఆర్గనైజేషన్ తన రిపోర్టులో సుమారు 5 లక్షల మంది మగ, ఆడపిల్లలు సరదాకు చెడిపోయి, అదేసరదాగా పెట్టుకుంటున్నారని అన్నదట—అమ్మమ్మో !

# ఫాలాక్షుని డైరీ

**వీర్యంలో బంగారం!**

పురుషేంద్రియంలో బంగారం ఉంటుందనీ, ఇంద్రియం చిక్కదనాన్నిబట్టి అందులో ఉన్న బంగారం నిష్పత్తి ఆధారపడుతుంటుందనీ అహమ్మదాబాదు బి. జె. మెడికల్ కాలేజికి చెందిన ఫిజియాలజీ అసిస్టెంటు ప్రొఫెసర్ డాక్టరు కె. పి. స్కంధన్ ఓ వైద్య మహాసభలో నొక్కి వక్కాణించారట. ఈ బంగారం సంతానోత్పత్తికి తోడ్పడుతోందనీ, కనుక ఆయుర్వేద వైద్య విధానంలో సంతాన శక్తి వని వానికి చేసే వైద్యంలో బంగారు భస్మం ఉపయోగించే వారనీ, అదే విధానంలో చికిత్స చేస్తే పురుషునికి వంధ్యత్వం పోగలదనికూడా ఆయన అభిప్రాయపడ్డారట. సంభోగ సమయంలో పరాకాష్ఠ చెందుతున్నప్పుడు ప్రోస్టేట్ గ్లాండుల నుంచి ఏపిడి డిమిస్ నుంచి వెలువడే ద్రవంలో యీ బంగారం కనబడుతోందని ఆయన వివరించారట.

**వృద్ధ ప్రేమాయణం!**

జోహాన్స్‌బర్గ్‌లో 72 ఏళ్ల డాక్టరు క్రిస్టస్ హామిల్టన్ భార్య చనిపోయినందువల్ల ఓదార్పుకోసం ఓ చర్చికివెళ్లేవారుట. అదే చర్చికి ఓ కాన్వెంటులో పని చేస్తున్న మదర్ సుపీరియర్ జాన్ తాడెస్ క్లాస్ అనే ఆమె కూడా వచ్చేదట. గత 40 ఏళ్ళుగా ఆ కాన్వెంటులో పని చేస్తున్నఆమెకు 63 ఏళ్లట. 63 ఏళ్ల జాన్ తాడెస్ క్లాసూ ఆ 72 ఏళ్ల క్రిస్టస్ హామిల్టను గారూ పరస్పరం ప్రేమించుకుని ప్రేమను దాచుకోలేక ఇద్దరూ లేచిపోయారట. తాను 63 ఏళ్ల వయసు వరకూ దగ్గరకు రానీని మన్మథుణ్ణి తీరావచ్చాక పొమ్మని అనలేకపోయి ఆ డాక్టరుతోనే లేచిపోయినట్లు ఆ సిస్టర్ చెప్పిందట. కాపోయినా మన్మథుడికి మాత్రం ఆ మాత్రం ఆలోచనొద్దు! పోయిపోయి ముసల్వాళ్ల మీదా తన బాణాలొదిలేది!




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.



భూతవైద్యం
జమిందారుగారి గారాల కూతురు ఆమె. "నిగ నిగలాడే ద్రాక్ష గుత్తిలా ఎదిగింది ఆమె...... మిట్ట మధ్యాహ్నపు సూర్యుడంతటి తీక్షణమైన యవ్వనాన్ని తనలో దాచుకుంది. మొగల్ ప్రభువుల విలాస మందిరాలపైన ఉండే గోపురాల్లా ఆమె రొమ్ములు పెరిగాయి...ఆమె దుపట్టాలో గుండ్రని భుజాలు ఇమడటం లేదు. కేశ భారాన్ని మోయలేక మెడ ఉసూరు మంటోంది. ఆమె గోడను నెడితే అది పడిపోవలసిందే!
అన్నీ ఉన్న ఆమెకు హఠాత్తుగా పిచ్చెక్కింది. భూతం ఆవేశించింది... బట్టలు చింపుకుంది... జుట్టు పీక్కుంది. కుండల్ని పగలగొట్టింది. తండ్రిని రెండు చేతులా ఎత్తి దూరంగా విసిరేసింది.
ఎందుకలా చేసిందామె ? ఏ భూతవైద్యుడు— ఏ విధంగా ఆమెను భూతం బారినుండి రక్షించాడు ?
ప్రఖ్యాత రచయిత కర్తార్‌సింగ్ దుగ్గల్ తన పంజాబీ కథ 'భూతవైద్యుడు'లో అద్భుతంగా వర్ణిస్తాడు. ఈ కథనేగాక మరెన్నో భాషల వైవిధ్యంగల కథలను అందజేస్తోంది 'విపుల'. కథలతో పాటు ఎన్నో కార్టూన్లు, విచిత్ర విశ్వ విజ్ఞానం అందజేస్తుంది విపుల. కథలకు ఆఫ్‌సెట్‌లో నాలుగు రంగుల చిత్రాలు 'విపుల' ప్రత్యేకత.
విశ్వకథా విపంచి
విపుల
132 పేజీలు రెండు రూపాయలే

సుందరాంగుల సుందరస్వప్నాలకు
సౌందర్యరూపకల్పన —

రాజ్‌కమల్

చీరలు






RAJKAMAL

Agent for South India,
Babulal Shiv Shanker Agencies.
Inder Bagh, Sultan Bazar, Hyderabad-A.P. Phone : 459